శ్రీరామ

# నీతిసంగ్రహము

గ్రంథకర్త

పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు.



ప్రకాశకులు

రెడ్డిసోదరులు

రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.

బ్రాంచి:—రాజమండ్రి

932



వెల అణాలు

# విషయసూచిక

| | పుట |
|---|---|
| సేతుబంధనము | 1 |
| రావణుని వేగులు | 9 |
| రాముని యస్త్రనైపుణ్యము | 13 |
| సీత దుఃఖము | 14 |
| అంగదరాయబారము | 18 |
| ప్రథమదిన యుద్ధము (ఇంద్రజిత్తు) | 22 |
| నాగపాశబంధనము | 23 |
| రెండవనాఁటి యుద్ధము | 26 |
| నీల ప్రహస్తుల యుద్ధము | 31 |
| రావణ ప్రథమయుద్ధము | 32 |
| మూఁడవనాఁటి యుద్ధము | 42 |
| కుంభకర్ణుని మేలొ్కలుపుట | 43 |
| కుంభకర్ణుని యుద్ధము | 49 |
| మూఁడవనాఁటి రాత్రి యుద్ధము (ఇంద్రజిత్తు) | 61 |
| హనుమంతుఁ డోషధిపర్వతముఁ దెచ్చుట | 63 |
| లంకాదాహము | 65 |
| నాలవనాఁటి యుద్ధము | 66 |

శ్రీరామ

# విక్రమ రాఘవము

## :సేతుబంధనము:

శ్రీరామచంద్రుండు వానరుల సముద్రముం దాఁటు నుపాయం బడిగెను. వారి వారికిఁ దోఁచిన తెఱంగున వారు చెప్పిరి. "హనుమా! నీ వేమనియెద?" వని ప్రేమ దైవార లలితవాక్యముల రాముండు హనుమంతు నడుగ నతఁ డిట్ల నియె. "మత్పుణ్యమూర్తీ! ఆలోచనలేల? విశ్వరూపంబు ధరించి సమస్త వానరబలంబుల మీతోఁ గూడ నీయొక్క మహాసముద్రమును గాదు: సప్తసముద్రముల నవలీల దాఁ టింతు. ఉత్తరువిమ్ము. కాదేని లంక నకలంకగతిఁ బ్రాఁత గలంగ నీ దరికిఁగొనివచ్చెద. "ఏయ్యదాజ్ఞ?" అనుడు రామ చంద్రుండు మందహాసరోచులు మొగమున నిగుడ నయ్యగ చరవీరుం బొగడి "నాయనా! అమానుష్యచర్యలు నేఁ జేయింపఁ దలంపుగొనను. నీ వెంతకైన దగుదువు" అని విభీషణువంకఁ దిరిగి "సోదరా! నీ యభిప్రాయ మెట్టిది?" యని పృచ్ఛించెను. "మహాత్మా! సముద్రప్రార్థనంబుచేసి తరించునది యుత్తమమార్గమని నా మతము" అని యతఁడన

రాముఁ డతని సాధుభావంబునకు సామోపాయంబునకు నుచితజ్ఞతకు సంతసించి సమ్మతించి లక్ష్మణుం డొక్క రమ్యస్థలంబునఁ గుశాస్తరణం బొనరింప నినకులాభరణం బందు నియతుండై శయనించి సముద్రతరణంబుం గూర్చి సముద్రప్రార్థనంబు గావించె. మూఁ డహోరాత్రములు నిరశన నియతవ్రతుఁడై రాముఁడు పారావారముం గుఱించి ప్రార్థించినను జలధి సౌమ్యమూర్తియై పొడసూపకుండె. జడబుద్ధులు మహాత్ముల ప్రార్థనంబుల విందురె? రామునకుఁ గోప మగ్గలంబయ్యెను. అతని కోపమున కెదురేది? "లక్ష్మణా! విల్లిటు తెమ్ము.

క. క్షమయును బ్రియవాదిత్వము
శమమును నార్జవము దు ర్విచారులు కడుఁ జా
లమిగా నూహింతురు లో
కము వెఱచుట బెట్టిదంబు గలుగుటఁ జుమ్మీ!

రావణుని పొరుగు వాఁడగు నీ జడునకు సుగుణం బెట్లు గలుగు? కానిమ్ము. నా శక్తి చూపెదఁగాక!" యని విల్లందికొని బ్రహ్మాస్త్ర మెక్కువేసి యాకర్ణాంతము లాగ అంతకే,

శా. ఆకంపించె ధరిత్రి బిట్టవిసి న
[illegible]వ్రోసె బ్రహ్మాండము

స్తోకధ్వాంతముగప్పెఁ దప్పిరి గతుల్
సోమార్కు లుల్కాను రా
లోకంబయ్యె నభంబు దిగ్వివరముల్
తూలెన్ యుగాంతాభ్రముల్
వేకూలెం బాడలేక భూతములు ఘో
లెంగూలె నిర్ఘాతముల్.

బ్రహ్మాస్త్రము సామాన్యాస్త్రమా? ఆ సమయమున జడధి వడంకి సురసరిన్ముఖనదులు దివ్యరూపంబులు ధరించి వెంటరా సౌమ్యమానవాకారంబున నరపాలునిపాలికేతెంచి కేలు మొగిచి,

చ. "నృపవర! మున్ను లోకములు
నిల్పినవాఁడవు నీవకావె! యా
ది పురుషుఁడైన విష్ణుఁడవు
దేవ హితంబొనరింప నిప్డు డీ
వపువు ధరించినాఁడవు భ
వన్మహిమంబున భూతకోటి ని
క్కపుగతి నుండఁ గావుము జ
గం బెఱుఁగం గడసూపనేటికిన్"

వనచరులచే శిలాచయంబులు వృక్షషండంబులు పర్వతంబులు దెప్పించి నా మీఁద వేయింపుము. వాని మునుఁగక యెగయనెత్తి పట్టియుండెద. నీచే నిర్మింపఁబడిన సేతు

వృత్తాంతము బ్రహ్మాండం బుండుదనుక నుండఁగలదు. మీరా సేతువుపైఁ దరింపఁదగుదు" రని వినమ్రుఁడై వేఁడిన నతని పలుకుల కలరి రామవిభుండు "సరిత్పతీ! నా బాణ మవంధ్యము. ఎవరిపై దీని వదలుదు?" నన సముద్రుం డిట్లనియె.

"నా కుత్తరభాగంబున ద్రుమకుల్యమని యొక యవటంబు గలదు. అందాభీలముఖులు పెక్కు రక్కసులుండి లోకంబుల హింసించుచుందురు. ఆ మూఁకపై నీ యస్త్రము విడువు" మన నా దుర్ధర ధనుర్ధరుం డట్ల చేసె. అమ్మహానీయాస్త్రంబు మిణుఁగుఱులు మింటనంట వెడలి యా మడువునఁ బిడుగువడువునఁ బడి తజ్జలంబుల శోషింపఁజేసి పశ్చాచరులఁ బొరిగొని క్రమ్మఱఁ దూణీరంబునకు వచ్చె.

తదనంతరము వానరులు కొండలు గుట్టలు ఱాలు తరువులు దెచ్చి విశ్వకర్మ పుత్త్రుండగు నలున కందిచ్చుచుండిరి. వానిని నలుఁడు నేర్పు మెఱయ నందికొని బల్లపాటుగాఁ బఱపుచు నంచులఁ దరుసంఘంబుల నదుముచు నాఁడు పది యామడల వెడలుపునఁ బదునాలుగామడ నిడుపున బలువుగాఁ గట్టెను. అంత నీ వానరులు రామకార్యకరణసంజాత పరవశత్వంబున నా నగం బెక్కడఁ గొల్లగించుకొనిపోవుదురో యను భయంబునఁ గాపాడుకొనఁ బోవువానివలె భానుఁ డస్తాద్రిని ప్రాలెను. కపులు వారిధి బంధన కార్యంబు చాలించి కొందఱు సేతువునకుఁ గాపుంచి యెప్పుడు తెల్లవా

ఱునా! ఎపుడు వారధి పూర్తియగునా! యని ముచ్చట
లాడుకొనుచు నుండిరి.

శార్దూలుండను రావణుని వేగులవాఁ డిదియెల్లఁజూచి
పోయి తన ప్రభువునకు విన్నవింప నతఁడు శుకుండను వానిం
బిలిచి "నీవేగి సుగ్రీవునితో 'వృథావైరంబేల? నీవు వానర
నాథుండవు. నేను దానవనాథుండను. మనకు మైత్రి తగును
గాని తాపసుఁడగు వెడఁగు నరునితోఁ బొసంగదు. కిష్కింధ
ధకుఁ బొమ్ము. కాదేని మమ్మాశ్రయింపు' మని బుద్ధిచెప్పిరం"
మని పంప నతండు శుకరూపియై చని యంతరిక్షంబున నిలిచి
రావణ వాక్యంబులు సుగ్రీవునకు వినఁబలికె. వెన్నెలలోఁ
గూర్చుండి వేడుక మాటలాడుకొనుచున్న కపు లా వచనం
బుల విని తటుక్కున మింటి కెగసి వాలంబుల వాని మెడఁజుట్టి
సగమాయువుపోవ గుంజుకొని వచ్చి పిడికిటిపోటుల లెస్సగా
మర్దించిరి. వారి దెబ్బలకుఁ దాళలేక శుకుండు "రామా!
వార్తావహు నీవిధి నొప్పింప న్యాయమే? శుభేక్షణా! కృపం
జూడు"మని ప్రార్థింప దయామూర్తి వానివిడిపించె. "సుగ్రీవా!
దశగ్రీవుతో నేమందు?" నన శుకున కలుకతో సుగ్రీవుం
డిట్లనియె:—

సీ. "తలపోసి చూచినఁ దా నాకు నవ్వాలిఁ
బోలిన యట్టి తోఁ బుట్టు వనుము

# విక్రమ రాఘవము

వసుమతీసుత నట్లు వంచించి తెచ్చుట
మగటిమి గాదది మఱవకనుము
లోకమరాక్షస లోకంబుగాఁ జేయఁ
గపిసేనతో వార్ధిఁ గడతుమనుము
లంకఁ ద్రికూటాచ లముతోన మున్నీటఁ
బెఱికి పేటాడి వై పింతు ననుము
యాతుధాన రాజ్యంబున కర్హుఁడైన
మా విభీషణుఁ డలర ల క్ష్మణుఁడు గడఁగి
కరాళగ సప్తార్చిఁ బేర్చి నర్చి
లెసఁగ నింద్రజిచ్ఛలభంబు నేర్చు ననుము.

మ. విలుయూపంబు శరాళి దర్భతతి మౌ
ర్వీటంకృతుల్ మంత్రముల్
కలితా స్ఫుక్ఛటలాజ్యధారలు నిషం
గ ద్రోణికల్ స్రుక్స్రువం
బులుగా రాముఁడు యాజకుండయి సమి
ద్భూవేదిఁ గోపాన లా
ర్చులతో నద్దశకంఠుఁడన్ పశువు వే
ల్చున్ నిర్జర ప్రీతిగన్.

దిక్కు నిప్పుడ చూచికొమ్మనుము. భోగంబు లెల్ల నిప్పుడ పొందుమనుము. పొము" వాఁడు బ్రదుకఁ గాంచి రాముని [illegible]ంచి వెడలెను.

మఱునాఁడు కపి బలంబెల్లఁ బంతంబులు వైచికొని శిర ములఁ గరముల భుజములఁ గక్షల బాహాసంధుల వాలములఁ దరులు గిరు లిఱికించికొని తెచ్చి వనధిం బడవైచిరి. పూర్వ పశ్చిమ పాథోధిపర్యంతము గల పాదపాదులఁ బర్వతంబులఁ జెఱుకువారు, దొంతులుగా ధరించి తెచ్చువారు, నెగయ వైచి పట్టుకొనువారు, మధ్య నందికొనువారు, నిచ్చి మరలు వారు, గుభుల్లున జలధి వైచువారు నై మెచ్చుటఁజూచినఁ గపి పర్వతమయమై కులిశనిహతి లేని కులగిరులు నా వనచరులు దోతెంచిరి. ఒకఁడు దెచ్చు కొండను వేఱొకఁ డెత్తుకొనిపోవ మొదటివాఁడు మఱొకటి గైకొని వానికంటె ముందుగా వడి వడి వచ్చును. ఒకఁడు తెచ్చు వృక్షముల నింకొకఁ డెక్కి ఫలములరాల్ప మిగిలిన కోఁతులు నోరూరఁ దించుఁ బోవుచు నీడల లెక్కింపక మధ్యందిన వేళవఱ కిట్లు పనిచేసి యప్పుడు కొంతసేపు విశ్రమించి మరలఁ గార్యమునకుఁ గడంగిరి. నాఁడు యోజనార్ధ శత మాత్రము జరగెను. సాయంతన మయ్యెను, కపు లలసి యారాత్రి నిద్రించిరి కాని,

సీ. కలలోనఁ గొండ తెకఁ గుల పర్వతంబులు
దెచ్చి కట్టితి మని మెచ్చువారు
లంక సొచ్చితిమని హుంకారములు సెల్లఁ
గలవరించుచు బిట్టు తెలియువారు

వీచుల తాఁకున – నేచు నర్ణవరవ
మడఁగి పోవఁ గరుణు – పొందువారు
నిద్రమైఁ బ్రేలించు – నద్రులగతిఁ దోఁపఁ
జూచి చేతులఁ బయ – లూఁచువారుఁ
గాల రాచువారు – వేలంబుచుట్టును
దిరుగువారుఁ గట్ట – నరయువారు
నిదుర యుడిగి తరణి – కెదురు చూచుచునుండు
వారు నగుచు రజ – నిపూరగింప.

ఉ. తమ్ములలోన నీవు నొక
తమ్ముఁడవంచు విరోధి తమ్మునిన్
దమ్ముని నింద్రనందనుని
తమ్మునిఁ జూచిన చూపుఁ జూచెఁ గ్రొ
త్తమ్ముల తమ్ములైన కను
దమ్ముల నవ్విభు మేలు సూచుచున్
దమ్ములఁ జూచున న్కరణిఁ
దమ్ములవిం దుదయాద్రిఁ దోఁచినన్.

"నేఁడెల్లని వనముల వనములెల్ల గొండలఁ గొండలు గానే మునుముకొని తెచ్చి వనరాశి ముంతుము. చాలకున్న లంక నే పెత్రికివైతు" మని కపులు పంతంబులాడుచుఁ గొండలు తరుతండంబులు తెచ్చి సాగరంబున వైచిరి. సేతువు పూర్తి యయ్యెను.

శ్రీరామచంద్రుం డా సేతుబంధనంబు గని ముదిత హృదయుండై సేనలనడపుమని నీలున కనుజ్ఞ యొసంగి సుగ్రీవుండును నంగద స్కంధాధి రూఢుండగు లక్ష్మణుండును నిరుగెలంకులఁ జనుదేరఁ బవనతనయు నెక్కి పయనించె. శాఖాచరులు క్రేళ్లు దాటుచుఁ బల్లటీల్గొట్టుచు నెగసి మొగులు లంటుచు నంబుధి నుఱుకుచు నీఁదుచుఁ బెక్కుతెఱంగుల జాతిచేష్టితములు సేయుచు రామున కుల్లాసంబు గల్గించుచు నవ్వాలిగట్టుసేరి,

ఆ. వె. ఎన్నఁ బెక్కులగుచు నెక్కడఁ జూచిన
నడచువారు నడవఁ గడఁగువారు
విడియువారు మఱియు వీడెత్తువారునై
నేల యీనినట్లు నిండఁబడిరి.

రాజు లాజుల కేగునప్పుడు తొడిపూసికట్టి వీర శ్రీవిభాసితులై యలరారవలయుఁ గావునఁ గైకొనుఁడని సాగరుండు భూషణాంబర కవచాయుధంబులఁ దెచ్చి యిచ్చి వీడుకోలు వడసి మగిడె.

—:రావణుని వేగులు:—

రావణుండు మంత్రాలోచనము గావించి మరల వానర సేనఁ జక్కనరసిరా శుకసారణులను వేగులఁ బంపె. వారు వానర వేషంబుల ధరియించి కపులఁ గలిసి తిరుగుచుండ

విభీషణుఁడు వారిం గనిపట్టి పట్టుకొని రాఘవుల ముందటం బెట్టె. రాముఁడల్లన నవ్వి వేగులతో, "మా బలంబెల్లఁ గలయం గనుంగొనిపొండు రావణునకుఁ దెల్పి మరల నా మాటలుగా నిట్లనుఁడు.

క. 'క్షితిసుత నేలావునఁ దె
చ్చితి వీవాలావు సకల సేనలతో నా
జి తటింజూపుచు నా శర
తతి కించుక సైఁపు' మనుము దర్పమెలర్పన్.

మ. 'దినవాథుం డుదయాద్రిశృంగమున కే
తేనల్లి మారీచ ర
క్తనిషిక్తంబగు నా శరంబు మునుగా
ధారాళమై ఘోరమై
ధనురభ్రంబునఁ బుట్టి నంపజడిచే
తం గూల్తు లంకాపురీ
ఘనసాలావల నేలమట్టముగ నా
కంపింప నక్తంచరుల్'

అనిన,

శుకసారణులు "దేవా నీవు విజయంబు గైకొను" మని యటనుండి మరలి లంక కరిగి రావణున కిట్లనిరి. "దేవా! రాఘవులు సుగ్రీవబలముతో దశయోజన విస్తృతంబును శతయోజనాయతంబునుగా సేతు వొనరించి శరధిం దరించి

సువేలాచలంబున విడిసియున్నారు. ఆ బలంబు లెక్కింప నలున కలవిగాదు రాఘవులఁ గాంచిన వారితోఁ బోరికిఁ దొడరు వీరుఁ డెందును లేఁడని తోఁచును. సుగ్రీవు నీవ యెఱుంగుదు. నాఁడు మన లంకఁ గాల్చినవాఁడును వాలి పుత్త్రుండును నలుండు నీలుండును మూఁడవకన్ను మూసిన రుద్రునివంటివారు" అన రావణుండు నవ్వి "వికృతమర్కట వేషులఁ గని బీతుకుడిచి వచ్చి యిట్లు ప్రేలకుఁడు రండు" అని యొక యున్నతసౌధం బెక్కి కపిబలంబు లెవ్వేఱ నిరూపింపుఁడన శుకుండు వేర్వేర నా బలంబు నభివర్ణించి చూపుచు వచ్చి రాముం జూపి యిట్లనియె. "దనుజేంద్రా! అటు చూడుము. నారి లాగి యర్ధనారీశ్వరుని వింటిని నడిమికిఁ ద్రుంచిన దీర్ఘబాహార్గళంబు లమర నిందీవరశ్యామ కోమల కాంతిని శరీరంబు ప్రకాశింప నరవిందముల చాయ యుచకెల్లఁ బచరించునట్లు దోఁప నలరుచూఁపులు సుగ్రీవ విభీషణుల యుల్లంబులు పల్లవింపఁజూచుచు విభీషణు మంత్రులు లంక తెఱఁగు సెప్పఁ గేల సమ్ముగిం గిరఁ ద్రిప్పుచున్న లోకైకవీరుని మహాధనుర్ధరుని గంటివే? అతఁడే రాముఁడు.

మృగభాతిఁ బొలిచిన రీ మాయామంత్రి మారీచు

పసిఁడి చర ంబుపైఁ రీ బవ్వళించి

నీపేరు విన్నంతఁ * గోపించి మండెడు
మిత్రతనూభవు * మీఁద వ్రాలి
నిను వాలమునఁగట్టి * వనధుల ముంచిన
వాలి నందనునిపైఁ * గేలుమోపి
యలనాఁడు నీ సుతు * నక్షునిఁ జంపిన
గాడ్పుపుఁ బట్టిపైఁ * గాలు సాఁచి
మొనసి నీదు సహోదరి * ముక్కు సెవులు
మోటుపఱచిన ఖడ్గంబె * మ్రోలఁ గ్రాల
ఖరుని దునిమిన శిత సాయ * కంబు మొక్క
దీర్పుచున్నాఁడు కంటె వై * దేహి విభుని"

ఆ పలుకులు విని కలంగిన యుల్లంబుతో నిశాచర వల్లభుండు "పగవారి నిట్లు స్తుతింపఁ జెల్లునే" యని యాను చున్నంత రావణు రీతిఁ జూచి యోర్వనివాఁడై భానుజుండు గగనంబునవచ్చి రావణు నెదపైఁ దన్ని, "దుర్మార్గా! నీకింత కావరమే? వాలితిమ్మ్రి నెంచియైన రామద్రోహంబు మాన వైతివిగా!

చ. కనియెద రెల్లి రక్కసులు
కన్నుల పండువుగాఁగఁ బై పయిం
గనదురు రత్నపుంఖ కలి
కారుచి జల నిరంతరంబులై

కనలుచు లంకపై నిగుడఁ
గా దశకంఠ కఠోరకంఠ ఖం
డన చణచండమార్గణ గ
ణస్ఫురణస్ఫుట విస్ఫులింగముల్"

అని యార్చి సుగ్రీవ దశగ్రీవుల కొకింత మల్లరణంబు జరిగెను. తుట్టతుదకు రావణుం బెట్టుమూర్ఛిలఁ దాఁచి చివాలున నెగిరి సుగ్రీవుఁడు రామునిఁజేరె. రాముఁడు సుగ్రీవుంగని "అన్నా! యింతసాహసమే? అవిచారితకార్య మిట్లొనరింప రాజునకుఁ జెల్లునే? నీవటఁ జిక్కియుండినఁ బిదప నయ్యెడు మేలు మాకేల?" యని మందలించెను.

—:రాముని యస్త్ర నైపుణ్యము:—

అంతలోఁ బోక తన వైభవము రామునకుఁ జూప నిశ్చయించి వివిధాంబరాభరణ విభూషితుండై వేలకొలఁది పొలసుదిండులు గొలువ నక్తంచరేంద్రుం డుత్తరగోపురంబున రామునకుఁ బొడకట్టెను. రావణ వృత్తాంతము వివరించుచుండిన విభీషణమంత్రులతని రామునకుం జూపిరి. ధీమంతుఁడగు రాముఁడు వానిఁ దేటిపాటఁ జూచి వాని హృదయ మెఱింగి విల్లందికొని పరుండి యున్నవాఁ డట్లుండియే యొక మహాస్త్రముం బ్రయోగించెను. అయ్యస్త్ర మొకటి పదియైపదులు నూఱులై పదపడి యసంఖ్యాకములై చని రావణుని ఛత్ర చామరాదులను దశమకుటంబులను హారములను ద్రుంచి

వైచెను. అవి గోపురముపైఁగొన్ని క్రిందఁ గొన్ని పురమునఁ
గొన్ని శరధిని గొన్ని జలజల రాలి పడియెను. రావణుని
కాయమునకు గాయ మేమాత్రముఁ దగులదయ్యె. రాముని
యస్త్రపాండిత్యమును గొనియాడుచు రావణుఁడు, "రామా!
నీవే విలువిద్యకు గురువీరుఁడవు. నీకొరులు సములు గారు.
బళీ! సెబాసు! నీవంటి వీరుని ముల్లోకములఁ గాన" నవిన
భటులు "దేవా! పగతుఁ డెంతవాఁడైనఁ బొగడఁ జెల్లునే?
రందుపోద" మనవుడు దశకంధరుండు, "వీరుండు పగవాఁ
డగు నేమి? తనవాఁ డగు నేమి? ఎవ్వఁడైన నేమి? వీర గుణ
ములు స్తోత్రపాత్రములుగదా! మఱియు నీరాము వీర్యశౌర్య
ధైర్య గాంభీర్య సాహసాదుల నావంటివాఁడు నుతింపవలయుఁ
గాక తక్కొరుండెర్వ్వాఁడే?" యనుచు నచ్చోటువాసెను.

—:సీత దుఃఖము:—

తదనంతరము రాముని జయింప నసాధ్యంబని రావ
ణుఁడు దీర్ఘముగఁ బర్యాలోచించి "సీత వశంవదయయ్యె నేని
రాఘవుం డదివిని గతాసుండు గాఁగలఁడు. రాముని మరణ
వార్త వినకున్న సీత వశంపడదు. దీని కేది దారి?" యని
చింతించి విద్యుజ్జిహ్వుండను మాయలానిం బిలిచి పరమ రహ
స్యంబుగా "నా వెనుక నశోకవనికి రాముని శిరంబువంటి శిరం
బును ధనువును నీ విద్యాబలంబు పెంపునఁ గల్పించికొని తె"
మ్మని నియమించి తా నశోకవనంబునకుం జని సీతంగని

“సరోజాన ! యిన్నినాళ్లు నన్నొల్లకుంటివి. ఇఁకనైనఁ గైకొం
దువుగదా! వట్టిబీరములతో నిన్నినాళ్లేలగడపితివి? రాముఁడు
కపులతో వనధిదాఁటి రాఁగాఁ బ్రహస్తుఁడు సేనాసమేతుండై
పోయి యర్ధరాత్రంబున నిద్రాసక్తుండైన రాముని మస్తకంబు
దునిమి యస్తమితుం జేసె. లక్ష్మణాదులు పాఱి శరధింబడి
మ్రగ్గిరి. అల్లదే మ్రోఁగుచున్న విజయభేరీధ్వని వింటివే?”
యనుచుండ నంతలో విద్యుజ్జిహ్వుండు సంభ్రమంబునఁ బఱ
తెంచి రావణ నియోగంబునఁ దాఁదెచ్చిన శరశరాసన శిరం
బులు సీతముందటం బెట్టి చనియె. అదిగని సీత నిజమని భ్రమించి
మూర్ఛిల్లి మొదలంటనఱికిన తరువుపోలె భూస్థలివ్రాలి కొంత
తడవునకుఁ దెప్పిఱిల్లి “యకటా! వసిష్ఠు చరణయుగళసంగతిఁ
గన్న యుత్తమాంగంబు నేఁడిట్టులిద్దురాత్మమ్రోల ధూళిం
బ్రుంగి నేలఁ బడియెఁగదా!” అని నిజాంకతలంబునకుం దిగిచి
కొని “నాథా!

ఉ. ఏచిన యాఖరాదుల న
నేకుల నొక్కటిచంపి సంయమీం
ద్రోచిత వాక్యపూజనల
నొంది జగంబు నలంకరించు నీ
యా చిఱునవ్వుతోడి వద
నాంబుజమోయిది! సప్తతంతు ర

త్రాచణ! తాటకాహరణ
శంసితశైశవ! హానకేశ్వరా!

సమస్తలోక మంగళకరమై నాచేఁ బరిష్వక్తమైన నీగాత్రము నేఁడు కటకటా! క్రవ్యాదులచేభక్షింపఁబడియెనే! విధవబ్రదు కధమంబగునని పెద్దలందురు. నాథా! బాల్యమాదిగ సహచరినైన నన్నునాథంజేసి తండ్రింగన దివికేగితే? నన్నుఁ గొనిపొమ్ము. ఇదుగో వచ్చెద. లక్ష్మణునివలన జాతవాత్సల్యయైన కౌసల్య నీ నిహతంబును నా చెలియు విని గుండె క్రుళ్ళి చావకున్నె? అక్కటా! పతికిమున్నుగఁ బరలోకమున కరుగు సతు లేమి నోచిరోకదా!

మ. క్షితిలో దుర్వ్యసనంబులన్ వెసఁ దొలం
గింపన్ సమర్థుండవై
సతతంబున్ విజితారివై వినయ శా
స్త్రజ్ఞుండవై నిశ్చల
వ్రత నిష్ఠాఖనివై వెలుంగు సుగుణ
వ్రాతాబ్ధికి న్నీకు దు
ష్కృతికింబోలె నకాలమృత్యు వెటు గ
ల్గెన్నేఁడు ప్రాణేశ్వరా!

గీ. కులముఁ జెఱుపంగఁ బుట్టిన క్రూరచిత్త
నేను బుణ్యాత్మునకు రాఘ వేశ్వరునకుఁ
బత్నిగా నమ్మహాత్ముని ప్రాణముగొన
జగతిఁ బుట్టిన మృత్యువ నగుట నిజము.

రావణా! నీకుఁ బుణ్య ము-డిని. కల్యాణగమ
నంబు సతికిఁ బరమసాధనము. నీ ఖడ్గంబున నా తల దెగనేసి
రాముతోఁ గూర్చుమా!" యని పలవించుచుండ ద్వారరక్షి
రాక్షసుం డొకఁడు దశగ్రీవునొద్ద కరుదెంచి కృతాంజలిపు
టుండై "సమస్త వాహినీ పతి యగు ప్రహస్తుండు సర్వామా
త్యసహితుఁడై భవద్దర్శనార్థియై సముపస్థితుం డయ్యె. అత
నిచేఁ బ్రేషితుఁడనై వచ్చితి" నన నిష్ప్రాక్కనట్టులు తత్త
రించి యచ్చోటు వాసి చనియె. తత్క్షణంబ తన్మాయాకల్పిత
శిరంబును గార్ముకంబును నంతర్ధానంబు నొందె. అది గని
విభీషణు సతి సరమ సీత కిట్లనియె.

"అమ్మా! నీ మీఁది కూర్మిం జేసి రావణభయంబు
విసర్జించి నీకు హితంబు గూర్చుచున్నాను. నీవు చింతింప
కుము. వీని మాటలు నమ్మకుము. ఇది యెల్లఁ గృత్రి
మంబు. రాముఁ డెక్కడ? ఈ నీచరాక్షసులు పరిమార్చు
టెక్కడ? అతని యాజానుబాహుత్వాది రాజలక్షణ ధార్మి
కత్వ పౌరుష నయజ్ఞత్వంబులు విచారించిన వధ్యత్వంబు
లేదు. రాముఁడు సర్వవానర చమూసమేతుఁడై శరధి
దాఁటి దక్షిణతీరంబున విడిసియున్నాఁడు. రావణు వార్త
నిజమేని యీ విలునమ్ములుఁ దలయునేవీ?" యని సమాశ్వా
సించిన సీత కొంత యూఱడిల్లి రావణు మంత్రాలోచనం
బెఱింగి రమ్మనియె.

సీత యాసతి సొదల ధరించి సరమ చని యంతయు నెఱింగి వచ్చి "అమ్మా! వానర సింహనాదములు వార్తలు ఘూర్ణిల్లునట్టులు వినవచ్చిన రాక్షసవీరులు చేష్టలు దక్కి యాలోచించుచున్నారు. రావణ మాత కైకసియు మాల్యవంతుండును నతికాయుండును బెక్కు తెఱంగుల నిన్ను విడువుమని నీతు లొత్తి చెప్పినను వినక చావ నిశాచరవల్లభుండు సంసిద్ధుండయ్యె. చింత యుడుగుము" అని సాంత్వన వాక్యంబుల ననునయించె. సీతయు నెమ్మదినుండె.

—:అంగద రాయబారము:—

రావణుండు మంత్రులతో విచారించి ప్రహస్తుని గొంత బలంబుతోఁ బూర్వద్వారంబునకుఁ బంపి మహోదర మహాపార్శ్వాదుల దక్షిణద్వారంబున కంపి యింద్రజిత్తును బశ్చిమద్వార రక్షణంబు సేయంబనిచి విరూపాక్షాది బహు రాక్షస సమేతుండై రావణుం డుత్తరద్వార రక్షణంబు సేయ నిశ్చయించి యా కుస్థితకర్మంబునఁ దన్నుఁ గృతకృత్యునిగాఁ దలంచుకొనుచు నప్రమత్తుండై నడిచె.

అశ్వత్థామంబు విభీషణు బుద్ధిబలంబున నెఱింగి రఘుపతి నీలుని దూర్పునకును వాలితనయు దక్షిణమునకు నాంజనేయుఁ బశ్చిమమునకు నియమించి లక్ష్మణ సుగ్రీవ జాంబవత్ప్రముఖుల వలసినపట్ల సాయ మొనరింప నేర్పరించి తా నుత్తరద్వారంబును ముట్టడింప నిశ్చయించి సన్నద్ధకవ

చుండును గాంచన సూత్ర నిబద్ధతూణీరుండును సధిజ్య ధను ర్ధరుండును బాణపాణియునై తాను ముంగల, సుగ్రీవ విభీ షణులు కెలంకుల, నడుమ సౌమిత్రియుఁ, బిఱుంద జాంబవ త్ప్రముఖ నిఖిల యూథాధిపతులునుగా నడిచి సువేలంబు డిగ్గి యుత్తరద్వారంబు సేరంజని సేనాసన్నివేశంబు గావించి సామాద్యుపాయ నీతిఫలతత్త్వవిదుండుగావున దూత ముఖం బునఁ బరిపంథిం బిలువ నిచ్చించి యంగదుం బిలిచి "నీవు నిర్భీతి మెఱుఁ నేగి నా వచనంబులుగాఁ బలుకు నప్పలుకులు వినుము.

మ. "కడిమిం బోరికి శూరతం గడఁగి రా
కాదేని వైదేహి నేఁ
గడవందెచ్చితిఁ దప్పుగావుమని లం
కారాజ్య మొప్పించి వె
ల్వడి ప్రాణంబులు గాచికొంచు దివిజు
ల్సంతోషముం బొంద నె,
య్యెడకైనం జనుమా విభీషణుఁడు రా
జవ్వీటికిన్ రావణా!

చ. కపటమువన్ని జానకి న
కల్మషఁ దెచ్చిన యట్టి పాపక
ర్మ ఫుఁ బొడువం దనూజ హిత.
మంత్రిసమేతముగా దశాస్య! ము

ద్వీపుల శిలీము ఖజ్వలన
దీర్ఘతరార్చుల నేర్తు నిన్ను నీ
తపమున కట్లు మెచ్చిన వి
ధాతృఁడు వచ్చిన నెందుఁ జొచ్చినన్"

అనినఁ దారానందనుండు 'చిత్త' మని తారాపథం
బున కెగసి రెండవవైశ్వానరునిభంగి వెలుంగుచు వైనతేయు
వేగంబునఁ జని కైలాసశిఖర సంకాశ మహోన్నత పాండర
ప్రాసాదాగ్ర భాగంబున సచివసమన్వితంబుగా నాసీనుండై
కార్యపర్యాలోచనంబు సేయుచుండిన రావణుఁగని తత్సమీ
పమునునుండి, సాహంకారుఁడై

చ. "చెఱపడి నీ మదం బడఁగఁ
జేసిన యర్జును వేయిచేతులున్
నఱకి భుజావిజృంభణము
నం గడుబేర్చిన జామదగ్న్యు విల్
విఱిచిన రాముబంట విన
వే నను నంగదు సర్వగర్వమున్
నెఱిసెడ నాల్గువారిధుల
నిన్నటు ముంచిన వాలిపుత్త్రుఁడన్"

అని పలికి శ్రీరామసందేశంబు నెఱుకపఱచి యేమి
యుత్తరమిత్తు వని యడిగె.

రావ:—ఓరీ నీచవానరా! నీవలె మున్నొక క్రోఁతివచ్చి కాలులు ప్రేలి తోఁకఁ గాల్పించుకొని పోయె. అది నీ వెఱుగుదువే?

అంగ:—దానికే యాక్రోఁతిసిమాలోఁ జేరనీకతలఁతిమి.

రావ:—పితృద్రోహిని గలిసి పౌరుషహీనుండవైతివేల? మీ తండ్రి నా కత్యంతమిత్రుఁడు. నన్నుఁ జేరుము. రామ సుగ్రీవుల నిగ్రహించి కిష్కింధ నీ కప్పగించెద.

అంగ:—నీచా! నీ వలెనే యతికామివై మా తండ్రి చెడెను. నీవును జెడనున్నాఁడవు. రాముఁడు లోకమాన్యుఁడగుటచే నతని నాశ్రయించితి. జగదేకమాతను జగత్పాలను తనిచ్చి నీవును రాముని శరణుపొందుము. కాదేని రామ బాణాగ్ని నెల్లి మ్రగ్గుటనిజము. రాము నెవ్వనిగాఁదలంచితివి?

అదరు బెదరు లేక పలికిన యంగదు పలుకులకు రావణుఁడు రోషోద్రిక్తుఁడై వీనింబట్టి కట్టుఁడన నల్వురు రక్కసులు పాశములం గొనివచ్చి యంగదుంబట్టికొనిరి. చిక్కినవానివలె నటించి వాలికొడుకు వారలలో నొక్కని వాలమునఁ గంఠముఁజివోసి యొక్కని నెడమకాల నిఱికించికొని మఱియిరువురఁ సిరుగేలఁ బట్టి యెత్తికొని యెగసి యంతరిక్షమున ... యుసురులూడునట్లును విసరివైచె. అదిగని పెక్కురు రక్కసులుక్కుమిగిలి ముసలముద్గరశూలాదుల ధరించి తన్నుఁగవియ వారలఁ గాలఁ జేతుల వాలమ్మున మర్దించి కొలువుమీఁద

వితెగి కూలందాఁచి రఘువీరుని పాదంబుల వ్రాలి సమస్తము విన్నవించెను. రాముఁ డలరి "చెప్పినంతకంటె నెక్కువ చేయ నీక కాని యొరుల కేవియే?" యని యభినుతించి రక్కసుల నుక్కడంపఁ గపుల కుత్తరు విచ్చె.

## —:ప్రథమ దిన యుద్ధము:—

### (ఇంద్రజిత్తు)

వానరయూథంబు లద్రులదిరి మాఱుమ్రోవ నార్చుచు నగడ్తలు పూడ్పందొడంగిరి. రావణుండును సేనాపతుల కాలంబున కానతిచ్చె. వారును వీరును గలిసి దొమ్మియుద్ధము చేసిరి. ఒక్కొక రొక్కొకనితో డీకొనిరి. పెక్కు రొక్కని జుట్టిరి. ఒక్కఁడు పెక్కుర బలుపిడి చుట్టుముట్టెను. హనుమ జంబుమాలిం జంపె. విభీషణుండు మిత్రఘ్నుం బొరిపుచ్చె. మైందుండు వజ్రముష్టికి దీర్ఘనిద్ర పుచ్చె. ద్వివిదుం డశని ప్రభుని బిలుకుమార్చె. గజుఁడు తపను నేలఁగలిపె నలుఁడు ప్రతపను బరిమార్చె. సుగ్రీవుండు ప్రఘసు నసువులార్చె. సుషేణుండు విద్యున్మాలిని గాలుప్రోలి కనిపె. రాముఁడు నాలుగు వాఁడితూపుల నగ్నికేతు రశ్మికేతు యజ్ఞశత్రు సుప్తఘ్నుఁ గీటడంచె. నెత్తురుటేఱులు పాఱె. ఏనుంగులు పీనుంగులయె. శతాంగంబులు భగ్నమ్ములయ్యె. హయంబులు క్షయంబునొందె. కాల్బలంబు మంటఁగలిసె. ఇంతలో

భాస్కరుం డస్తమించె. రాక్షసుల కనుకూలమ్మాగ నిరులు గ్రమ్మె. పరస్పరము జయకాంక్ష లినుమడింపఁ జలంబుడింపక బవరంబు సాఁగించిరి. తోఁక లేనివారిని దోషాచరులని కపులు గుర్తించుచుఁ బోరిరి. తోఁక లున్నవారు కపులని యసురు లెఱిఁగి జగడించిరి. పెక్కురు రక్కసులు కపులచే మడిసిరి. తనవారి చావును నగచరుల రభసోద్రేకంబును గని మేఘనాథుఁడు మేఘనిర్ఘోష సంకాశంబుగ సింహనాదంబు సేసి ఘోరంబుగఁ బోరె. కపులు నొచ్చి విచ్చి పాఱఁదొడంగిరి. అంగదుం డదిగని నిలు నిలు మని యదల్చి యొక్కదూఁకున నింద్రజిద్రథంబు చూర్ణంబుగావించి పాణిప్రహారంబున శిరంబుపై నెత్తురుగ్రక్కఁ బొడిచె. ఇంద్రజిత్తుండు చేయునది లేక విసంజ్ఞుండై కొంతవడికిఁ దెలిసి రెట్టించిన యలుకను మేఘంబులకు దాఁటి దిచ్చుమొగంబై శరవర్షంబు ఘోరంబుగఁ గపులపైఁ గురియించె. కపులు దిక్కుతెలియక భిక్కరించి చూచు

## —:నాగపాశ బంధనము:—

చుండిరి. శ్రీరాముఁడు హనుమ దంగద జాంబవ త్సుషేణాదులఁ గని రాక్షసునిఁగని నరసి రండని యాజ్ఞాపించె. వారలు గగనంబున కెగసి వానింగానక వాని సునిశితసాయకంబులఁ గడునొచ్చి ధరణికి దాఁటిరి. అంత వాఁడు సంక్రుద్ధుండై ఘోరాశీవిష భూతపాశంబుల రామలక్ష్మణులఁ గట్టివైచె. ఈషద్భ్రూభంగమాత్రంబున సర్వజగత్సంహర్తయుఁ గర్తయునైన

రాముండు బ్రహ్మవరదానపాలనంబుకొఱకు శక్రజిత్ప్రయుక్త నాగబంధ సహనంబు యుక్తంబని తలంచి యనుజసహితం బుగాఁ బంధింపబడియె. అంత నింద్రజిత్తు వారిపైఁ బెక్కు నారాచంబు లడరించి విసంజ్ఞులఁ గావించి రాఘవులు చచ్చిర కాఁ దలంచి జయభేరి మ్రోయించుచు లంకలోని కరిగి తండ్రి కీ యుదంతంబు దెలిపి సంతసపఱిచె.

ఇట సుగ్రీవాదులు శరబద్ధులైన దాశరథుల నవలోకించి దీనులై శోకవ్యాకులులైరి. విభీషణుం డిది రాక్షస మాయ యని నిరూపించి వారి నోదార్చుచు రామలక్ష్మణుల జాగరూకుండై కనిపెట్టియుండె. రావణుండు రాక్షసస్త్రీలతో నాగపాశబద్ధులైన రాఘవుల సీతకుఁజూపి తోడితెండన వార లద్దేవి విమానంబున నిడికొని పాలికలనికిఁ గొనిపోయి రామ లక్ష్మణుల పాటు సూపిరి. ఆయమ పడియున్న రాఘవులఁ బలవించు కపులఁ గనుంగొని కురరి క్రియఁ బేరెలుంగున,

ఉ. "ఓ రఘునాథ! పుణ్యచరి

తోజ్జ్వల! చాపకౌశలాప శి

క్షారమణీయ! దివ్యశర

జాల పరిశ్రమశస్త్రహస్త! నీ

వీ రణశయ్యఁ గన్మొరుచు

పేర్పడఁ జూచియు నున్నదాన నా

కూరిమిసూచితిట్లు నృప
కుంజర! దీనికి నన్ను నేమనక?

శా. అన్నా! లక్ష్మణ! భ్రాతృవత్సల! సురం
తాయాస ఖిన్నుండవ
య్యున్ నిద్రారహితుండవై యకట! ము
న్నుగ్రాటవీ భూములం
దన్నం గొల్తుగదన్న! నేఁడు రణ శ
య్యన్ భూవిభుండుండఁగాఁ
గన్నాఁగం దగునయ్య! నీ నిదురకుం
గాలం బయోధ్యం గదా!"

అని శోకింప "ఇది రాఘవుల మరణంబుగాదు. మరణ చిహ్నంబులు వారియంగంబులఁ గాన్పింపవు. శరపాశ బద్ధులైనవారు. దుఃఖమోహంబులు పరిత్యజించి స్వస్థచిత్తవు గమ్ము" అని త్రిజట యూఱడిలం బల్కుచు విమానంబుని గ్రమ్మఱించి యశోకవనికిం గొనిపోయె. శరతల్పగతులైన రాఘవులపాటునకుఁ గపులెల్ల నిబ్బరంబు లేక దురపిల్లుచుండిరి. కొంతొకవడికి రాముఁడు లబ్ధసంజ్ఞుండై తన పార్శ్వంబున రుధిరక్లిన్న సర్వాంగుండై పుడమింబడియున్న సౌమిత్రింగాంచి మరల మూర్ఛిల్లి విభీషణు నుపచారంబులఁదెలిసి "అయ్యో! నాకన్ను లేమి నేఁడిట్టి దుస్స్వప్నదర్శనము గనుచున్నది? నా తమ్ముఁడు వేఱొకలాగైన నిఁక జానకియేల? నాజీవితము లేల?

క. పరికింపఁగ జానకితో
 సరియగు సతి దొరకుఁగాని జగతి నితనితో
 సరియగు తమ్ముండును సాం
 పరాయికుఁడు సఖుఁడు భక్తి పరుఁడు దొరకునే?

సుగ్రీవా! నీవు కిష్కింధకేగుము. విభీషణా! నాగతి యిట్లయ్యె. తమ్మునితోడిదే నాకు లోకము. నే నసువులఁ బాసెద" అని దుఃఖింప వానరులెల్ల గొల్లున నేడ్చిరి. అంత "రామా! నీవు వినతాసుతుందలంప నాగబాధము వీడు" నని వాయువశంబున నొకవార్త వినవచ్చె. రాఘవుండు సుపర్ణుం దనమనమున దలంచుమాత్రన జలధితోయంబులు పాయలు విచ్చి పర్వతఘోరాయత పక్షపాత చలితాచలుఁడై వినతాసుతుండు చనుదెంచె. అతనింగని శరభూత మహాబల భీకరోరగంబులు రాఘవుల విచ్చి పఱచె. గరుడుండు రాఘవులదేహంబు పరిమార్జనంబు సేసి కౌఁగిలించి పరిరంభించి వీడ్కొని వెడలె. రామలక్ష్మణులు విగతపాశులై విశల్యులైనం జూచి కపులు నింగి భంగించు నెలుంగులు సెలంగ సింహనాదంబులు సేసిరి.

## —: రెండవ నాఁటి యుద్ధము :—

వానరుల సింహనాదంబులు విని విస్మయంబంది ప్రధాన సేనాధిపతి యగు ప్రహస్తునకు సకంపన వజ్రదంష్ట్ర ధూమ్రా

క్షులఁ దోడిచ్చి పురికొల్పి తరుచరులఁ బొలియించిరండని పం
పెను. ధరాతలం బద్రువ రథనేమి స్వనంబులు వెలయ మత్త
మాతంగ తురంగ పదాతి ఘీంకృతి హేషాసింహా గర్జనంబులు
రోదోంతరంబు నిండఁ బ్లవంగుల చెవులు చిల్లులుపడ గుణటం
కృతులు సేయుచు వచ్చి ప్రహస్తుండు వానరవాహినింగదిసె.
తరుచరవరులును విభీషణ సుగ్రీవ ప్రేరితులై తరు గిరి శిలా
చయంబు లాయుధంబులుగాఁ గొని నిశాచరులఁ దాఁకిరి.
హనుమంతుండు ధూమ్రాక్షుం దాఁకి యొక్క తరువువైవ దాని
నతఁడు నడుమన తుండించివైచె. మరల నొక్క గిరిశృంగము వైవ
ధూమ్రాక్షుఁడు దానిఁ జూర్ణంబుగావించి మూఁడు వాఁడితూ
పుల వాతూలసుతుండు తూలునట్లు నుదురంటనేసె. హనుమ
ముండి పెనుశిలనెత్తి వాని రథంబును రథ్యములతో నుగ్గునూ
చంబు గావించి వానిపైకి దుమికె. రక్కసుండు గదవైవ నది
యనుమ తల దగిలి తుత్తునియ లయ్యె. అంత ధూమ్రాక్షుని
నతఁ డంతకుండు కడకాళ్లుపట్టి గిర గిరఁ ద్రిప్పి యెనుఁగులపై
నుదికి వానితో ననేక పయూధంబుల నుగ్గుగావించి యార్చె.
మఱియొకవంక నకంపనుండు కపులఁ దూపులఁ జక్కు చీకాకు
గావింప వారి యాకులంపాటు సూచి మైంద ద్వివిదులు
వానిపైఁ దరుశిలా వర్షంబు గురియించిరి. శరవృష్టి నా శిలా
వృష్టి మాన్చి యకంపనుండు కపులు కంపింప శరపరంపర
లేసెను. హనుమానుఁడు వాని విజృంభణముం గని యా

దెసకుం గవిసి యొక్కయూఁకున వాని రథంబు నేలమట్టము
గాఁగా స్యందనంబుపైకి లంఘించి యుగ్యంబుల నాలుకలు వ్రేల
గ్రుద్ది తన్ను గొట్టవచ్చిన వానిగుదియ లంకించుకొని వానితలఁ
జదియఁగొట్టి చంపె తక్కిన రక్కసులఁ బ్లవంగపుంగవులు
తత్తిమిరి.

వేఱొక్క ప్రక్క మహాకాయుండు పిశాచముఖహయం
బులం బూన్చిన తేరెక్కి కఠోరకార్ముక ప్రముఖాయుధంబులు
ధరించి శాఖామృగ భీకరంబులుగా బవరంబు సేయుచుండె.
వానిచేఁ బెక్కురు ప్లవగులు మడిసిరి. తదితరులూడని బాడు
చూచి నంగదుండు విక్రమించి వెఱవకుఁడని ధైర్యంబు దెల్పి
మహాకాయుం దలపడ గుండెలెత్తి కుంభికుంభములు వ్రయ్యలు
వాయ సేయుచు దంతికాండముల గురుసులు రాఁగిచి
వాహంబుల మోఁదుచు వాలంబు పెంచి మొత్తంబులుగాఁ
బొలసువిందుల కుత్తుకలన్ త్రొక్కి కత్తిరించుచు వానిపైఁ గవిసె.
రక్కసులు సంగరోత్సాహంబుడింక మత్సరంబున నంగదుని
బరశుపట్టిస శూలపాసతోమరాది సాధనంబుల నొప్పించి కా
యంబు గాయంబు చేసి పుష్పితాశోకంబు పగిదిఁ గావించిరి.
అంగదుండు తోఁకద్రొక్కిన భుజంగముంబుభంగి రేఁగి మహా
కాయుం బట్టికొని ముంజేతులమోఁది మస్తకంబుఁ జఱచి సం
ధులఁ జదిపి వాలవల్లిని మెడ నుఱివెట్టి నేలతోనడిచి వానిఁ
జిత్రవధంబుచేసి యా ౧.

అంత నతని మిత్రులేద్దురును దమ్ముఁడు మహానాదుం డును జాతరోషులై వాలిపుత్త్రుం జుట్టు ముట్టిరి. గజగవయ గవాక్ష పృథు పనస శతబలి ప్రముఖు లంగదునికిఁ దోడు పడఁ గ్రందుకయ్యంబు ప్రవర్తిల్లె.

వజ్రనాభుండు పృథుసుం దాఁకి యేడమ్ముల వక్షంబు నాఁటనేయ నతం డరదంబు నుగ్గుగా నుఱికి గుఱ్ఱంబులఁ జదిపి సూతుం బొరిగొని వజ్రనాభు శిరంబు పట్టికొని గుల్ల తిత్తిగా నఁదికి చంపె. రుధిరాశుఁడు గవాక్షుని గవాక్షిత వక్షుం జేయ నతఁ డది యోర్చి సాలంబువైవఁ దుమురుసేసి రథంబు డిగ్గి ఖడ్గంబుగొని యురుదేరఁబడిన పరిఘ మొండు గొని గవాక్షుండు రుధిరాశుని రుధిరంబు గ్రక్కఁ నలియఁ బొడిచి చంపె. కాలదంష్ట్రుఁడు ఋషభునిపైఁ దన వారణం బును డీకొలుప నతండు పై కుఱికి వాని దంష్ట్ర లూడఁబెఱికి విగతప్రాణుం జేసె. కాలకల్పుఁడు పనసుపై నడరిన ముష్టి పాటితోఁ బొట్ట పగులఁదన్నె. వపాశుఁడు గజుఁడు వైచు శిల లెగరఁగొట్టుచుఁ బది బాణంబుల నొప్పించిన గజుం డలిగి సుపర్ణుపగిది స్యందనంబుపైకి లంఘించి వాని కంఠంబు నొత్తి పట్టి రత్నకుండల జ్వలితంబగు శిరంబు తునిసి దిగువఁబడియె. అది గని శతమాయుఁడు గజుసపై కుఱుకఁ బనస వృషభ శతబలులు గజునకుఁ దోడ్పడి శిలావృష్టిముంచి శతమాయుని విరథుం జేసిరి. వాఁడు నేలకు లంఘించి యొక్కొక్కతూపున

నూర్వురు కపులం గ్రుచ్చి యండఱం జెల్లాచెదరు గావింప శతవలి విజృంభించి వాని ఖడ్గంబు నొడిసికొని వ్రేసిన నది వాఁడు ఖేటంబుచేఁ దప్పించుకొని యురస్థలంబు వ్రేసిన శతవలి యెడ దొలంగి

తే. గీ. శిరమునకుఁజూపి దిగువ ల క్ష్యించివ్రేయఁ
దొడలు తెగి వాఁడు గరుడు ని క్తుండనిహతిఁ
బడు మహాఫణిగతి సుడి కి వచ్చువచ్చి
నేలఁ దలక్రిందుగాఁబడి క్రి ధూళిబ్రుంగె.

ఇంకొకపంక్తి వలీముఖులు వజ్రదంష్ట్రుని వజ్రసన్నిభ శిలీముఖంబుల నైఁపలేక పాఱుచుండిరి. వారల విలోకించి యంగదుండు ధనుర్నిర్ముక్త శరసమానవేగుండై పఱతెంచి యొక్క నగంబున వాని రథంబు నుగ్గునూచంబు గావించె. వాఁడు నరదంబునుండి లాఘవంబునఁ దప్పించికొని నేల కుఱికి యంగదుం గదచే వ్రేసె. అతఁడు చలింపక నక్క యోరీ యింతయే నీ బలంబని పరిహాసించి వానిం దలపడె. ఇరువురు జయకాంక్షులై యొండొరుల వ్రేయుచు మార్గంబు లెఱింగి విన్నాణంబులు నెఱపుచు విచిత్రపదక్రమంబులం బోరుచుఁ బరిశ్రాంతులై జానువు లూఁతగా ముందఱికి మ్రొగ్గ తిలంబడుచు లేచుచుఁ గొంతివడి ద్వంద యుద్ధంబు సలిపిరి. అంతకంత నెచ్చినరోసంబున నింద్రపౌత్త్రుండు సంక్రుద్ధుం డమయ మెఱిఁగి వాని పదంబులువ ట్టి బర బరఁ గొంతదూర

మీాఁచి యొకచోఁ బడియున్న ఖడ్గం బంకించి వాని తలఁ గోసి పాఱవైచె.

## —:నీల ప్రహస్తుల యుద్ధము:—

ఇవ్వేళఁ బ్రధాన సేనాపతులగు నీల ప్రహస్తు లొకవంకఁ జిత్రముగఁ బోరాడుచుండిరి. ప్రహస్తహస్త ముక్త ప్రశస్త కాండ ప్రకాండంబుల వారింప వలవిగాక నీలుండు నిమీలితాక్షుండై జడిసికిం దలంకని సుందరవృష భంబు చందంబునఁ గొండొకసేపోరకుండి రోష వశుండై యొక్క విశాలసాలంబుఁ గేల నందికొని లీలగా మండల ప్రకారంబునఁ ద్రిప్పుచుఁ బుంఖానుపుంఖంబులై కటతెంచు సాయకజాలంబుల జడియ నడుచుచు గరుడానిల తుల్యవేగం బునం బఱచి లాఘవంబున వాని రథంబుమీాఁదికి లంఘించి ఘోటకంబులఁ జదియమోఁది సూతుం దెగటార్చి మెఱుము మెఱసినట్లు మెఱయుచుఁ జిత్రగతులం దిరుగుచు లక్ష్యగోచ రుండు గాక కేతుదండంబు విఱుగఁదన్ని కాంచనవలయ భూషితంబైన దృఢకార్ముకం బొడిసిపట్టి వేదండం బిక్షుదం డంబు విఱిచినతెఱగున విఱిచి కిరీట కేయూరంబులు ధరణిం గూల్చినవాఁడును బెండుపడక కాలాయసమయంబగు ముస లంబు గైకొని విసరివైవ నది నీలుని శోణితదిగ్ధగాత్రునిం జేసె. దాని కించుకేని తల్లడపడక యగ్నిపుత్త్రుండు ఘోర మహోపల మొక్కటి గొని దోస్సారంబు జలిగూర్చి విసరి

పైవఁ గులిశహతిం బగులు కుధరంబుభంగిఁ బ్రహస్తుని తల వ్రయ్యలయ్యె. సేతుబంధంబు దాఁకి విశీర్ణంబైన సలిలంబు చందంబునఁ దదితరనక్తంచర సమూహంబు నిలుప ధాటికి నిలువలేక నిరుద్యమంబున లంకకుఁ బాఱె శ్రీరామ సుగ్రీవ విభీషణులు నీలాంగద శతవలి ప్రభృతుల కపుల్ఁ గొనియాడిరి.

### —:రావణ ప్రథమయుద్ధము:—

కాందిశీకులవలన జరిగిన సమర ప్రకారంబును బ్రహస్తాది రాత్రించర వీరనిహతంబును విని లోకవిద్రావణుండగు రావణుండు క్రోధమూర్ఛితుఁడై దిగ్గన నాసనంబు డిగ్గి యుగాంతావాతప్రేరిత వైశ్వానరుభంగి భగ్గుభగ్గున మండు రోష విశేషంబున నిరువదికన్నులు ప్రదీప్తవహ్నికుండంబులకై వడి వెలుంగ ననర్ఘమణిగణ ప్రభాపటల జటిల కిరీట కేయూరాది వివిధభూషణ ప్రభలచేత నావృతుండై శంపలతోడఁ గూడిన నీలజీమూతంబుకరణిం జెలంగుచుఁ గృశానుసంకాశంబైన కంటకంబు దొడగి తూణీరంబులు బిగించి శరశరాసనంబులు గైకొని జ్వలత్పావక సన్నిభంబును దురంగోత్తమయుక్తంబును సర్వాయుధ సంపన్నంబును గింకిణీ సహస్ర విభూషితంబును సముద్ధూత కేతుదండంబును నగు కాంచన రథంబెక్కి దశశిఖర సమన్వితంబైన నీలాచలంబునా డిట్టఁ దనరుచు రాక్షసకృతస్తవంబులచేఁ బూజ్యమానుండై,

చ. "అని కిఁక నేన వే చని ద
వాగ్నియుఁ బోలె శిలాంబకార్ముకుల్
వనచర సైనికాటవి న
వార్యగతిన్ వడినేర్చి జన్య మే
దిని కటుకీశరక్షతములఁ
దృప్తియొనర్చి నరేంద్రులన్ రయం
బున జముఁపీటికంపి జయ
ముం గొనివచ్చెద నీక్షణంబునన్"

అని శంఖభేరీపటహప్రణాద సమాస్ఫోటిత క్ష్వేళిత సింహనాద పురస్సరంబుగా నతని పిఱుందఁ బర్వ సమయ ఘూర్ణమాన మకర మత్స్యకచ్ఛప కాకోదర ప్రముఖ నిఖిల సత్త్వ సమన్విత మహార్ణవౌఘంబుకరణి ఘూర్ణిల్లుచు మహో త్తుంగ మాతంగ శతాంగ తురంగ సుభటాంగ సంకులంబైన రాక్షససైన్యంబు భయంకరగతి నడవఁ గదలి సంగర రంగము సేరి మహామీనంబు పూర్ణంబైన మహార్ణవౌఘంబుంబోలె వానరవాహినీసాగరౌఘంబు విదారించుచు సాంద్రంబుగా శర వర్షము పరఁగించె. రావణుంగని జానకీహరణ జనిత క్రోధం బున రాముండు చాపంబందుకొని లక్ష్మణ సహాయుండై వైరి రాక కెదురుసూచుచుండె. సుగ్రీవుండు బహువృక్షసానుకంద రంబైన యొక మహామహీధరాగ్రం బుత్పాటించి రావణుపై వైచిన నతం డది సహస్రప్రకారంబుల విరియఁ బ్రచండకాం

డంబుల భేదించి మహాశనితుల్యంబును విస్ఫులింగ పట। సం
చార ఘోరంబును జ్వలనజ్వాలా।లంబు నగు శరంబది వేసి
వధార్థం బాకర్ణాంతంబు లాగి విడిచిన నది మిడుఁగురులీనుచు
వచ్చి గుహారిత శక్తిక్రౌంచంబునుబోలె సుగ్రీవు నురంబు గాఁ
డిన నతండు గాఢమూర్ఛాపరవశుండై పుడమినొఱగె. మిత్ర
నందనుపాటు గని వివృద్ధకాయులై మహోన్నతశైలంబులఁ
గొని నల గవయ గవాక్ష ఋషభ సుషేణ జ్యోతిర్ముఖు లొ
క్కుమ్మడి దశకంధరుండాఁకి నగంబుల నైవ రక్షోవల్లభుండు
వాని నడుమన పడఁగొట్టె నొక్కొక్క యమ్మున వారల వ్యా
విద్ధగాత్రుల మూర్ఛాక్రాంతులఁజేసి సింహనాదంబులు సేయు
చుఁ గసిదీఱ వనాటసైన్యము నుఱుమాడి విక్రమవిహారంబు
సలిపె. అతనికోల్తల క్రొవ్వక బాణక్షత సంజాత రక్తధారా
సంవీతదేహులై మహానాదంబు సేయుచు భయశల్యవిద్ధులై
పాఱి వనాటులెల్ల రాముని శరణు చొచ్చిరి. అమ్మహాతుం
డును వారల కభయంబు దెల్పి గుణధ్వని సేయుచు రావణున
కభిముఖుండై యడరిన లక్ష్మణుం డంజలిగీలించి "యార్యా!
భవత్తేజంబు చేదోడుగా రావణు నెదుర్కొనఁ దలంచిన
నా యభిమతంబు సఫలంబు సేయు" మన, రాముఁడు "వత్సా!
దశాస్యుఁడు శూరశేఖరుఁడు. చిత్రపరాక్రముఁడు. రణమున
వాని నెదుర్కొన సుర లోహటింతురు. అప్రమాదుండవై
ప్రవర్తింపు" మని దీవించి పంచిన నతం డన్న చరణంబుల

కెఱఁగి సంరంభ విజృంభితుండై మహార్వనాదంబు సేయుచు రావణుండాసె. అంతలో హనుమంతుండు సౌమిత్రిని వారించి కల్పాంతకాలంబునం దుగ్రపటుప్రతాప స్ఫుటాట్టహాస సముచ్చలిత బ్రహ్మాండకోశుండైన శూలిపోలికఁ గ్రాలుచుఁ బాద విన్యాసంబున నుర్వీతలం బాకంపింప నత్యంత రభసంబుగా రావణుని రథంబు డాయుంజని మహేంద్రధ్వజ సన్నిభంబైన దక్షిణభుజం బెత్తి ప్రళయకాల జీమూత గర్జాసముజ్జృంభణ గంభీర భాషణంబుల,

మ. "మును బృందారక దానవోరగ ముఖుల్
 ముష్టాఘులం బడ్డవా
 రని నాచే నని యుండుదోరి కుటిల
 వ్యాపార! వేడ్కం బరాం
 గనలం జూచినయట్లు గాదిడియుఁ జ
 క్కంజూడు మా తెంపు మే
 కొన నీకెత్తిన కాలదండమగు నా
 యుద్దండ దోర్దండమున్"

అని గర్జించిన రావణుండు వికటంబుగ నవ్వి "యోరీ వానరా! నీ కరతలంబున మున్ను నన్ను వేసి కీర్తినొందుము. పదపడి జ్ఞాతవిక్రాంతుఁడవైన నిన్ను నిగ్రహింతు" నన "నోరా! ముచ్చ! నా తొలివ్రేటు నీకోడు కక్షుఁ డెఱుంగు. నీ వే మెఱుంగుదువు! నేఁడు గని నీకొడుకుతోఁ జెప్పికొనఁ బో"

మ్మని హనుమ వజ్రాశనిసమస్పర్శంబైన కరతలంబున వాని యురంబు బిట్టేసె. ఆదెబ్బతో రావణుండు వజ్రప్రహారంబునఁ గూలిన కులాచలంబు వడువున రథంబుపైఁ ద్రెళ్లి కొండొక సేపు చచ్చినట్లుండి మరలఁ దెలిసి హనుమంతుం గనుంగొని "వానరేంద్రా! శత్రుండవైనను భుజావిక్రమంబున శ్లాఘనీయుండవైతివి. నీవ్రేటున సమరవైరి ప్రేతలోకంబుఁ జూచివచ్చె" ననిన నాంజనేయుండు "రాక్షసకులపాంసనా! నీవు బ్రదికి యున్నఁ బొగడుటచే నాకే సిగ్గగుచున్నది. ఇసీ! నా వ్రేటెట్టి వ్రేటు? ఈసారి గొనుము. దిన నీకు మృత్యువు సిద్ధం" బని చేయెత్తునంతలో రావణుఁడు పదిచేతులతో నొక్కపెట్టఁ గరువలిపట్టిం బొడిచె. ఆ దెబ్బతో హనుమ కొంతసేపు మూర్ఛిల్లె. అది గని దశాననుఁడు "వీఁడు తెలివినొందెనేని మఱేమి సేయునో యను భయంబున నతనిం గ్రేడించి రథంబు రయంబునఁ దోలించుకొని ప్రహస్తాంతకుం దాఁకి ఘోరంబుగఁ బోరుచుండె. పూన్చిన పెనుముష్టితో నట్టే లేచి మారుతి "ఆహా! తప్పెఁ దప్పె. రావణుండు మఱి యన్యునితో రణంబు గావించుచున్నాఁడు. ఇప్పుడు వానిమీఁదికిఁ బోక ధర్మయుక్తంబుగాదు. కానిమ్ము. సమయము దొరకకుండునే?" యని కనుచుండెను. నీలుండు చాలసేపు దశకంధరుని బారి లక్షింపఁబడక పెనుబాములు గుఱుపు వాఁడలిగి యాగ్నేయాస్త్రం బదివోసి సమంత్రకంబుగాఁ బ్రయోగించె.

అది నీలునిం గట్టివైచిన ప్రచండాస్త్రతాడితుండై ధ్వజాగ్రంబు నుండి మోఁకాళ్లూఁతగా మందటికి మొగ్గతిలఁ బుడమింబడి పితృమాహాత్మ్య సంయోగంబువలనను స్వతేజంబువలనను బ్రాణంబులు రక్షించుకొని విసంజ్ఞుండై యుండె. రావణుండు సుమిత్రాపుత్త్రుం గదియుచు ఁబ్రసంజ్ఞులై యడ్డువచ్చిన సుగ్రీవ గవయ గవాక్షాదుల నివారింపుచు వచ్చి,

చ. "కుడువవు కట్ట వన్న పయిఁ
గూరిమి యీవిధిఁ ద్రిప్పి తేరఁగా
నడవుల నాకలంబుదిని
యింతటనుండక చిచ్చువాతికిన్
మిడుత గడంగుచందమున
మృత్యుముఖంబగు నాదు చూడ్కికిన్
వడిఁ జనుదెంచి నా తెరువు
వచ్చితి చచ్చితిగాక నీవిటన్"
అనిన లక్ష్మణుం డిట్లనియె.

ఉ. "కావరమెత్తి క్రొవ్వికను
గానక దుష్కృతి మాచరించుచున్
నీవొక పోటుబంటువలె
నేర్పులు చూపెదవేల? యీ వనా
టావలితోడిదేమిదె ర
క్షాభిరతిం జనుదెంచినాఁడ నా

విక్రమ రాఘవము

క్షేపకుడాసి జన్య మొన
రింపుము శూరుఁడవేని రావణా!

క. నిను నీవ పొగడికొనియెదు
ఘనులాత్మస్తుతికి నవ్వ గర్హకుఁ జొరరే
ధనువుగొనియుండ రజ్జుల
పనియేటికి వత్తుగాక బవరంబునకున్"

అంత దశగ్రీవుడు కుపితుండై యేను మార్గణమ్ముల లక్ష్మణునేయ నతండు వాని నడుమన ఖండించి నెలవంక కోలలవాని నుదురంటనేసె. రావణుండు విస్మయమంది బ్రహ్మదత్తంబైన కాలాగ్ని సమప్రభంబగు నొక్క బాణంబు ప్రయోగింప లక్ష్మణుండా దివ్యసాయకార్తుండై క్షణమాత్రంబు విసంజ్ఞుండై తెలిసి దశకంధరుని కోదండంబు నడిమికి విఱుగఁగొట్టి దశముకుటంబు వెడలిపడనేసి కఠినాశనికంటె మహాహికంటెఁ గులిశంబుకంటెఁ గాలుదండంబుకంటె నాభీలంబైన శరంబుఁ గూర్చి వాని యురంబు గాఁడనేసిన వాఁడు సౌమిత్రి శితశరాభిహతుండై యొక్కింతసేపు మూర్ఛాపరవశత్వంబున రథధ్వజం బూఁతగా నిల్చినవాఁడై యుండి వెండియు నతిప్రయాసంబున మూర్ఛదేఱి నికృత్త చాపుండును శరతాడితుండును మేదస్సిక్తగాత్రుండును రుధిరావసిక్తుండునై కోపోద్రేకంబున,

చ. జలరుహజన్ముచేఁ గనిన
శక్తికరంబునఁ బూని ధూమసం
జ్వలిత పటుచ్ఛటచ్ఛటర
వజ్రమరజ్వల నోద్భటచ్ఛటా
కులముగ వైవఁ బైఁ బఱపు
కోలలఁ జిక్కకవచ్చి బిట్టురః
ఫలకముదూఱి నంబడియెఁ
బర్వినమూర్ఛ నతండు భూస్థలిన్.

అట్లు పడిన లక్ష్మణు లంకకుఁ గొనిపోవువాఁడై నిలిం పారాతి రుదిగి యతనిం గదిసి యవ్వుడు గఱచి పొదివి యెత్త శక్తిపాత సమయంబున నరాతి దుర్ధరంబుగా వైష్ణవం బగు మహాతేజంబు లక్ష్మణుం బ్రవేశించుటం జేసి యిట్టట్టు కదల్పనేరక కైలాసం బెత్తిన భుజదండంబులు బెండువడం బెనంగునెడ హనుమంతుండు గని సమయమయ్యెనని పఱ తెంచి 'నిశాట విడు విడు' మని గిర గిరఁ దిరిగి కడఁ బిడి కిట వక్షంబు పొడిచి మూర్ఛిలఁజేసి జయ రామచంద్రా!' యని నరేంద్ర నందను నెత్తికొని శ్రీరామచంద్రు చరణ సన్నిధిని డించె. అంతలో లక్ష్మణు నురంబు గాఁడిన రావణు శక్తి యతని వీడె. లక్ష్మణుండు తేలె. రావణుండు కొంతవడికి మూర్ఛదెలిసి ప్రహస్తాది స్వజన మరణకారణ క్రోధవివశుఁడై వేఱొక చాపం బందికొని కయ్యంబునకుఁ గడంగె. అతిరథ

సంబునఁ జనుదెంచిన రావణుని, దదీయ దారుణ శరమర్ది తంబై పఱచు వానరబలంబును జూచి వైరివిరాముండగు రాముండు వాని కభిముఖుండై యడరె. అతనింగని హను మంతుం డంజలి ఘటించి "దేవా! రథస్థుండగు దశగ్రీవు నితోఁ బాదచారివై నీవు కయ్యంబుసేయ ననువుగాదు. నన్నధిరోహించి యమదు లగ్గింప వైరిని శాసింపు" మన రాముండు సంహృష్టుండై హనుమత్పృష్ఠారూఢుండై పూర్వా ద్రిపై వెలుంగు బాలభానునిపగిదిఁ దేజరిల్లుచు దారుణంబుగ శింజిని మ్రోయించుచు సాంద్ర జలదస్వనంబున నిట్లనియె.

ఉ. "నాకు మహాపకారము మ
నంబున నోడక చేసితింక నే
లోకము దూఱువాఁడవు? వె
లుంగుచు నీ వెనువెంట నా శరా
నీకము వచ్చినన్ దులువ!
నిన్నిట నెవ్వరుగాచువారు? ది
క్పాల కమలాసన ప్రభృతు
లైన వధింపక రాముఁడేగునే?

చ. అనుపమశక్తి నెవ్వని ర
ణావని మూర్ఛితుఁజేసి లంకకుం
గొని చనఁజూచి బాహువులు
గ్రుచ్చి కదల్పఁగఁజాలవైతి వా

ఘనభుజు నస్త్రకల్పు నరి
కాలుని సంగరభీము లక్ష్మణున్
నిను వధియించు నుర్వర జ
నించిన మృత్యువుగా నెఱుంగుమీ.

శూరమ్మన్యా! ఖరాదులపాటుఁ దలంచుకొను" మన రాక్షసరాజు కోపపరీతచిత్తుండై కార్ముకజ్యారవంబు భైరవంబుగా మ్రోయఁ గాలానల శిఖోపమంబులైన శితశిలీముఖంబుల మారుతిపైనొప్పించె. కృతవ్రణుండైన పావని నవలోకించి రాఘవుండు క్రోధారుణిత లోచనుండై కార్ముకగుణార్భటు లంబరంబు నిండ వివిధోగ్ర శరపరంపర లేసి సూతకేతన చక్ర ఘోటక గదా పరిఘాయస శూలప్రాస తోమరసహితంబుగా నతని స్యందనంబుం జిందఱవందఱలాడి యతని చేయెత్తనీక యశనిసంకాశ నిశితకాండంబుల దోర్మధ్యంబుగాఁడనేసి కోటీర పటలంబు బీఁటలు వాఱించి కోఱలు వెఱికిన మహాసర్పంబు తెఱంగున దర్పం బుడిగించి శరాహతుండై భృశార్తుండై విహ్వలుండై యున్న రావణుం గనుంగొని,

ఉ. "రాక్షసనాథ! నీ చలము
లావును జేవయు విక్రమంబు ప్ర
త్యక్షము గాఁగఁ జూపితివి
తప్పక మాకవి తెల్లమయ్యె దో

మ క్షితిపైన నీబలము
సర్వముఁ జూడఁగఁ గోరి నేఁడు వి
స్మితమయ బాహుశౌర్యమున
నాజి వధింపక కాచిపుచ్చితిన్.

చ. అసురవరా! రణార్దితుఁడ
వైతివి గావున లంకకేగి సొం
పెసఁగఁగ నేఁటిరాత్రి వసి
యించి గతశ్రమనశ్రముండవై
మసలక నీవు రేపకడ
మంచి శతాంగము నెక్కి ధన్వివై
వెసఁ జనుదెమ్ము నాదు
భుజ విక్రమమంతయుఁ జూచెదాజిలోన్"

అనిన, రావణుండు హతదర్ప సత్త్వతేజశ్శతాంగుఁడై యపహృత కిరీట శరాసి చాపుఁడై సాధ్వసంబుగొని రాముని దేరిచూడ నోడి వేఁజోక తేరిపైఁ బడి పాఱి లంకసొచ్చె. జన్య రంగమున నొచ్చిన తనవారిని నిశల్యులం జేసి రామచంద్రుండు కార్యశేషం బాలోచించుచుండె.

—:మూఁడవనాఁటి యుద్ధము:—

కాందిశీకుండైన దశకంధరుండు రామబాణ భయార్ది తుండై తనకుఁ గలిగిన శాపంబులఁ దలంచుకొని వ్యథితాకు లేంద్రియుండై కొలువుసేరి సభ్యులతో నాలోచించి కుంభకర్ణ

మేల్కొల్పునది కర్జంబని నిశ్చయించి యప్పని నొనరింపఁ దగు వారి కాజ్ఞ యిడి శయనమందిరమున కరిగె.

—:కుంభకర్ణుని మేల్కొలుపుట:—

మఱునాఁడు వేఁకువను గొందఱుపలలాశనులు కుంభకర్ణు నివేశనంబునకుం జని కాలవ్యాళంబు పగిది బుసకొట్టుచుఁ గుబుసంబు గప్పిన మహాపన్నగంబుకరణి వికీర్ణంబైన పర్వతంబు మాడ్కిఁ జూడ్కికి వ్రేఁగైయున్న యతనిం గాంచి సమీపించి తదీయ నిశ్వాస వాతావధూతులై నాసావివరంబుల లోనికిం బోవుచుఁ గ్రమ్మఱ నిర్గమించుచుఁ గారాకులగతి సుడివడుచుఁ గొంతవడిచిక్కులువడి నాసారోమంబుల గట్టిగఁ బట్టికొని యతిప్రయాసంబున నిర్గమించి పక్కలకొదిగి నిలిచి తద్విజయాంకగీతంబుల మహారవంబుగఁ బఠించిరి. పదపడి గొందఱు జలదంబులభంగి గర్జించిరి. కొందఱు భేరీమృదంగ పటహాదుల మ్రోఁతఁ గావించిరి. మఱికొందఱు కర్ణరంధ్రముల యొద్ద శంఖకాహళాదు లూఁదిరి. నానావిధ సంఘోషణంబులు ఘణభంగిం జెలంగి రోదోంతరాళంబు నిండెఁ గాని కుంభకర్ణుండు మేల్కొనఁడయ్యె. తదుపరి పరిఘపట్టిస శూలప్రాస తోమర-ముసలముసుంఠి ముద్గరముష్టి తల పృథు శైలశృంగంబుల నతని యంగంబు సాంద్రంబుగ మర్దించిరి. ప్రయోజనము లేదయ్యె. ఊరకున్న సిద్ధిఁ గార్యముగాదని వారు ఖుర తురంగ మహాంగ మాతంగంబులచేఁ ద్రొక్కించిరి. కొందఱు

చెవులయొద్ద సింహనాదములు సేలఁగిరి. కొందఱు పెనుశిలలు ఱువ్విరి. అందఱొక్కపెట్టు ఘోషించిరి. లంకయెల్లఁగలఁగెఁ గాని వినియోగము లేకపోయె. తుదకుఁ బొంగఁగాఁచిన నూనె బుంగలఁ గొని తెచ్చి చెవులలోఁ గ్రుమ్మరించిరి. మీసంబులు గడ్డంబులు వట్టికొని యూఁగులాడిరి. రురుకురర్యజసంఘంబులఁ ద్రొక్కించిరి. అప్పటికిఁ దన తనువున కెదియో సోకినట్లైన సతండు మెల్లన మూల్గుచుఁ బొరలెను. ఏమఱియుండిన రాకాసు లనేకులు వాని క్రిందఁబడి చచ్చిరి. పైనెక్కినవారుక్కుకుఁ దాటి పడ్లు జల్లినట్లు నొరలిరి. తదితరులు పాఱి పోయిరి. అంతఁ గుంభకర్ణుండు మూల్గిపిల్గి వదనగహ్వరంబున బడబానల శిఖమాడ్కి నాల్కదోఁప నావులించి కనులువిచ్చి సమీపమున రక్కసులు తనికై సిద్ధముచేసి యుంచిన వస్తు రాశిం గాంచి ముఖప్రక్షాళనాదికము గావించి పచ్చిమాంస రాసులకు మద్యఘటంబులకుఁ దోడుగ నంజకొనఁ బడియే నెనుఁబోతు లిరువదియేడ్గురు మనుజులు నేను అజంబులు వేయివరాహంబులు రెండువేలు చరణాయుధంబులు దావాగ్ని తృణంబునుబోలె నమలి రెండువేల ఘటంబుల నెత్తురుద్రావి త్రేఁపిన, నప్పుడు దాఁగియుండిన దనుజులు బయల్పడి రావణునకుఁ జాటిల్లిన యవస్థయుఁ దన్ను మేల్కొలుపం బుచ్చుటయుఁ దెల్పిరి. కుంభకర్ణుండు ముహూర్తకాలంబు మౌనముద్రం బూని తదనంతరము రక్షోభట పరివృతుఁడై రాజ

మార్గంబున మిన్నందినపొడవున నన్నకడకుబయలుదేఱె. లంక వెలినున్న వలీముఖులా యద్భుతాకారంబుంగని భీతిమెయిఁ బఱవ రాముఁడు ధనుఃపాణియై "విభీషణా! ఈభూతవృత్తాంత మే" మని యడిగెను. విభీషణుం డిట్లనియె.

"మహాత్మా! ఇతఁడే మా యన్నయగు కుంభకర్ణుండు. ఘనతరదేహంబు నమితశక్తియు నితనికిఁ బుట్టుకతోనవచ్చినది. ఇతఁడు జన్మించిననాఁడె భూతకోటుల మ్రింగుచుండ వాసవుండు కనలి వజ్రంబుతోఁ గొట్టె దాని కడలక కుంభకర్ణుఁడు వాసవునిదికి లఘించుచుఁ దన తనువుదాఁకి మొనలంట విఱిగిన యైరావతదంతంబు గొని యింద్రుని వ్రేయ నతం డడలి యజుని యొద్దకుఁ బాఱె. పదపడి బ్రహ్మంగూర్చి యితండుగ్రతపంబు గావించినఁ బరమేష్ఠి వీఁడేమి వర మడుగునో యని దిగులొందినమ్మగఁ దన యిల్లాలగు వాణింబంపి తరువాత నతండు వర మాయ వేంచేసెను. తనయెడఁ బ్రసన్నుండైన సురజ్యేష్ఠు ఎత్తించి యితండు 'నిదయ' యనఁబోయి వాగ్దతయైన వాణి కారణంబున 'నిద్ర' యని యడిగెను. అట్లగుఁగాక యని బ్రహ్మ తత్క్షణమే యంతర్థానుండయ్యె. అప్పటనే యితఁడు నిద్రకుఁబడియెను. ఆ వృత్తాంతము రావణుండెఱింగి బ్రహ్మం బ్రార్థించి యాఱునెలల కొకపరి మేల్కని యొకనాఁడు విహరించునట్లును నిద్రాదినంబునఁ దెలియఁబడునాఁ డితని బలము దూలునట్లును నతఁ డనుగ్రహింపఁ డము నిం దోడ్తెచ్చి తగిన

రక్షయొనర్చి నిద్రింప నొకగుహ యమర్చె. నిన్న మీచేనోడి
పాఱి సమయంబున కోడక యిట్లతని మేల్కొలిపినాఁడు.
నేఁడు కుంభకర్ణునకు జాగరదినంబుగాదు గావున దేవరచే నతఁ
డవశ్యము మృతినొందు. అంతవఱకు వనచరులు బెదరకుండ
'రావణుండు కపుల బెదరింపఁ బన్నిన దారుణమంత్రం బిది'
యని చాటఁబంపవలయు" నరేంద్రు నాజ్ఞను నీలుం డట్ల
కావించి దళంబుల గవఁకుంకు నడపించె.

అట నాస్థానంబునకువిచ్చేసి యన్నచరణంబులకెఱఁగి
తదీయనియోగంబున నర్హ పీఠంబునఁగూర్చుండి కుంభకర్ణుండు
"నన్నిట్లు మేలుకనిచిన కారణంబేమి? నికలుకఁ బుట్టించి ప్రాణము
లొల్లనివాఁ డెవండేని కలండే? అన్నా! ఉత్తరువిమ్ము. వాని
నిప్పుడ నూఱి చప్పరింతు" అన రావణుం డిట్లనియె.

క. "అద్రిచర సేనఁగొంచు స
ముద్రము బాధించి కడచి ముప్వురుసఁ ద్రికూ
టాద్రి బలసియున్నా రదె
ముద్రిత లంకాకవాట ముగ దాశరథుల్.

ప్రహస్తాది రక్షోవీరు లనేకులు కదనరంగంబునమ్రగ్గిరి.
అవలన నొక్క వనచరుఁడైన మ్రందినవాఁడు లేఁడు. నీవుగల్గ
నింద్రాముల గెల్చిన గర్వము సర్వము నేఁడు విఫలమైతూలెను.
కాన నీ • శాఖామృగావళింజమరి రాఘవుల సమరభూమికి

వలి యిచ్చి నన్ను విశ్రాంతుంజేయుము. వేళ గాకుండియు వేళ యైనందున రక్షాప్రాణార్థమై నిన్ను మేల్కొలుపవలసె"

"అన్నా! ము మీ మంత్ర సముయమందే మీకిటి కార్య మిబుడు జెప్పనే? మేరదప్పి తగవుమాని దుర్మోహివై యింతలు తెచ్చికొంటివి. నీ తెలివి కేమనవచ్చు? దుర్మోహం బున నేకగ్రాహి వగు నీ కెవ్వరిక దెల్పనగు? అధికుం డగు రాముండు నీయెగ్గు సైంచునే? ఇందఱు దెగియు నెఱుంగ కున్నావే? అగ్రజా! నీ మూర్ఖత కేమనవచ్చు? అదట్లుండె. చిన్నతమ్ముండు సభలో లేండు. వానినిగూడ యుద్ధభూమి మృత్యువు వాతం ద్రోయువుగదా!" యనిన కుంభకర్ణునకు రావణుం డిట్లను.

క. "కొలువున నాక ప్రియములు
పలికిన నేనలిగి తన్నుఁ బదహతి నొంపన్
నలువురు మంత్రులతో నిలు
వెలువడి రఘురాము శరణు వేడంగఁ జనియెన్"

అనినం గుంభకర్ణుం డొకింత విచారించి 'వాండేని వంశోద్ధారకుం డగుంగాత' మని యన్నంగని,

ఆ. వె. "మొదలపలయు విధముం బిదపం గావించుట
తుదినొనర్చు దానిం దొలుత సేత
సంధి విగ్రహాది సమయజ్ఞులగు నీతి
శాస్త్రవిదులు నడచు సరణిగాదు.

సహోదరస్నేహంబున నీవు మన్నించుటంజేసి యింత విన్నవించితి. మనకొలుచు బ్రహ్మకు నుపాస్యుండగు రామునకు నమస్కరించిన నేమికొఱంత? సీతను వదలుట కర్జంబు" అనిన రావణుండు కన్నులెఱ్ఱఁజేసి "కుంభకర్ణా! పెద్దవారికి నీతులుగఱప నిన్నుఁ బిలిపింప. రాముఁడు విష్ణుఁడగుఁగాక! త లక్ష్మి యగుఁగాక! అన్నియు నెఱుంగుదు. రక్షోవధార్థమై యవతరించిన రామునితో మనకెట్లు సంధిపొసఁగు? ఆవిష్ణువు మొదల బలి నేమిచేసె? రామునితో విగ్రహంబె కాని మఱి యొండు చేయనొల్ల. చాలుదువేని కలనికి నడువుము. కాదేని నిద్రింపఁబొమ్ము. నిద్రించు నిన్నెవ్వరుఁ జంపరు.

క. మును నాకు నోడిపోయిన
యనిమిషులఁట! క్రోఁతులైన । నఁట! లావెక్కన్
మనుజాశను నోర్వఁగ హరి
మనుజుండయ్యెనఁట! యిట్టి । మాటలు గలవే?

గీ. జనకసుత లక్ష్మి, రాముఁడు । వనజనాభుఁ
డగుట నిక్కమె యెఱింగియు । నితనిచేత
బవరమునఁ గూలి కైవల్య । పదమునొంద
తఁ దెచ్చితి నింకేమి । చెప్పఁ బొమ్ము"

అనిన,

## —:కుంభకర్ణుని యుద్ధము:—

రావణమతంబు విని కుంభకర్ణుండు మనంబునఁ గొంత వడి యోజించి "యన్నా! నే నుండ నీకుఁ జింత యేల? శూలంబు ధరియించి త్రిశూలివలె బయలుదేఱి వానరానీకంబును గడుపాఱ మ్రింగి సుగ్రీవ రాఘవుల బోరిపుచ్చి విజయంబు నీ కొనఁగూర్తు" నని శ్లక్ష్ణవాక్యంబుల నాశ్వాసించిన రావణుండు సంతసించి యగ్గించె. కుంభకర్ణుం డన్నచే సెలవుగొని యనేక ప్రాణిశోణిత దిగ్ధంబును దేవదానవ భయంకరంబును గరాళంబును నగు శూలంబుగొని రణోచితవాద్యములతో లంకాప్రాకారంబుఁ జెంగగొని నిజదర్శనభయంబున వానరులు పెనుగాలిం దూలు మొగుళులంబోలెఁ గనుకనిం బఱవ భీకరంబుగా నార్చె. ఆ యార్పునకుఁ గొందఱు రఘువీరుని వెనుకకుం బాఱిరి. కొందఱు దిగ్భ్రాంతులైరి. కొందఱు మూర్ఛిల్లిరి. కొందఱు గుండెలు పగిలి కూలిరి. సుగ్రీవాంగద జాంబవత్ప్రముఖుల వెనుకఁ గొందఱు ధైర్యంబవలంబించి యొక్కొక్క రొక్కొక్క శైలముం గొని కుంభకర్ణునిపై వైచిరి. అవి వాని కఠోరవక్షముం దాఁకి తునాతునకలై దిగువఁబడియె. అంత దశాననానుజుండు శూలంబున నక్కపులగుదులు గ్రుచ్చి యెత్తి నోటవైచుకొనుచు వనచరసేన నవలోకింప వా రందరు భీతింబొంది యొదిగియు వాఁగుల డాఁగియుఁ జచ్చినట్టులుండియు నంబుధిం జొచ్చియు

సేతువుమీఁదఁ బాఱిరియు వికావికలైరి. అత్తఱిం గవలో
కించి యంగదుండు,

ఉ. "పాఱకుఁ డేల పాఱెదరు?
ప్రాణము లెన్నటికింక నీగతిం
బాఱిన భూతముల్నగవె
పార్థివు నమ్ములు వీనిపై వడిం
బాఱెడు సంతదాఁక ధృతి
పట్టఁదగుం దశదిక్కులం గొనల్
మీఱెడు మాయశంబులకు
మేలగు పెంపు దలంపుఁ డీయెడన్.

పాఱిలోకనిందఁ బడుకంటె చచ్చి స్వర్గంబుఁ జూఱ
గొనుటఅదె?" అని ప్రోత్సహించియు నతని లెక్కింపక పాఱు
వారల కడ్డంబుసొచ్చి మరలించె. మైందుఁడు ద్వివిదుఁడు
నీలుఁడు హనుమ మొదలగు వానరప్రముఖులు గండశైలం
బులఁ గుంభకర్ణుపై ఱువ్విరి. దాని కతఁడు చలింపక రొమ్ముఁ
గరి నొక్కొకపోటున ఱోలివ్రాల మోఁదుచు విజృంభింపఁ
గపులు కోపాటోపులై వానిం జుట్టిముట్టి పర్వతంబెక్కి
నట్టులు వాని యొడలిపై నెక్కిరి. కుంభకర్ణుండు కొంతసే
పూరకుండి యొక్కసారిగ విదిర్చినఁ బెనుగాలిందూలు వెలగ
పండ్లువోలె నేలకు దుల్లిరి. లేచినవారిని గదతో మొత్తెను

లుగ వ్రేయుచు నెగసినవారిని గౌఁగిటికిం దార్చి చదుపుచు విక్రమించి కొందఱంబట్టి మ్రింగె. వారు పాతాళసన్నిభంబైన కంఠబిలంబునఁ బోయి హెచ్చరికతోఁ గొందఱు కర్ణద్వారముల బయల్పడుచుండిరి. కొందఱు నాసాకుహరంబుల వెలువడి తదీయ నిశ్వాసమారుతంబునఁ దూలంబులం బోలెఁ దూలుచు దూరంబునఁ బడిరి. అది గని యమ్మహాధికకాయుండు వెడలువారి నొడిచికొని చదియ నములుచుఁ గరాళదంష్ట్రాంతరాళంబుల వెడలిపడిన వారిని గాల నేలఁ జమరి సమరక్షోణి మేదోమాంసశోణితమే దురంబుగాఁ జేసెన్ సుగ్రీవుం డుగ్రుండై కదిసి యచలాగ్ర మొండుగొని వైవ దానికి వక్ష మతఁడు సూపి నవ్వి శూలంబుఁ ద్రిప్పి వైచె. దాని మరుత్సూనుండు నడుమన పట్టికొని మోఁకాటం బెట్టి విఱిచె. కట్టల్కం గుంభకర్ణుండు లంకామలయశృంగం బుత్పాటించివైచిన సుగ్రీవుండు విసంజ్ఞుండై పడియె. అట్లు పడినవాని లంకకు గొనిపోవ నెంచి కదిసి సుగ్రీవు నెత్తి మూఁపుపై నిడికొని రాక్షస సంస్తూయమానుండై వెడలె. ఇతని నడ్డుపడి విడిపించితినేని సుగ్రీవునకు యశోనాశమగునని హనుమ యూరకుండి తదితరుల నాశ్వాసించుచుండె. కొంత సేపటికి సుగ్రీవుఁ డాత్తసంజ్ఞుండై లంకాపుర రాజపథమును వీక్షించి తాఁ జిక్కియున్న కుంభకర్ణ భుజాంతరంబును బరీక్షించి నిశాతనఖంబుల నతని వ్రచ్చి దంతంబుల నాసికఁ

గోటికి నొప్పించిన హృతకర్ణనాసుండై విమర్దితశరీరుండై క్షత జార్ద్రిత్తుండై రోషంబునఁ గుంభకర్ణుండు వానరపతిం బట్టి యెత్తి పుడమిం బడవైచిన నతండు తప్పించుకొని లాఘవంబున మింటికెగసి వనచరామోదంబుగ రామసన్నిధిం జేరె.

చ. "చెలియలి ముక్కువోయెనను
సిగ్గున నెగ్గొనరించి రాముతో
వలవని వైరమెత్తుకొని
వారక పోరుచు నున్న యన్నకున్
దులువలునవ్వ నే మొగము
తోఁ బొడసూపుదునింక నమ హా
బలుఁడగు భానుసూను జన
పాలుర మ్రింగెదఁగాక పోయెదన్"

అని కుంభకర్ణుండు మగిడి వనచరసేనం దలపడి ప్రదీప్తుండైన యుగాంతకాలవైశ్వానరుండు ప్రజలంబోలె శోణిత గంధమత్తుం డగుటం జేసి స్వపర బల వివేకంబులేక యొక్కమాటు పెక్కండ్ర రక్కసులఁ గపుల భల్లూకంబుల బాహువులంబట్టి తిగిచి మ్రింగుచుఁ బ్రళయకాలంబునఁ బ్రాణిసంఘంబుల గ్రసించు మృత్యువు వితమున వానర రాక్షసుల భక్షించుచుఁ గంఠంబులుద్రెంచి రక్తంబు గ్రోలుచుఁ బాణితలంబున మెదిచి తన్మేదోమాంస మస్తిష్కపంకంబు శరీరంబున నలఁదుకొనుచు నిరుగెడలఁ బెడచేతుల శిరంబులు

పగులనడుచుచు ననేక ప్రకారంబుల వలీముఖుల వధింపఁ గడంగిన వానరులు భయభ్రాంతచిత్తులై పుఱిలోఁడి వఱచిరి. అదిగని లక్ష్మణుండు కోపోద్దీపితుఁడై బాణపరంపరలముంచె. వాఁడవి లెక్క సేయక పై పైఁ గవియుచురా విభీషణుండు గదగొని కుంభకర్ణుం గదిసె. తమ్ముఁగని మహాదేహుండు మదిం గొంత చింతించి మరల నిట్లనియె.

"వత్సా! విభీషణా! ధర్మమతివై దాశరథిం జేరితివి. పెక్కండ్లు లంక నిర్మలమతి నేలుము. మన వంశము రక్షింప నినవంశజు నాశ్రయించిన నిన్నని నొంపఁజాల. నీవు నా కతి రక్షణీయుండవు. తొలఁగిచని మాయన్నం జూచుచుండుము"

అనిన విభీషణుండు విషాదంబున మోము దిగవైచి గద నేలమోపి సంగరావనిం దొలంగి "యన్నా! నా విమల భావంబు నీవెఱుంగవే?" యని కన్నీరు నించె. కుంభకర్ణుండు కపులఁ జిక్కు చీకాకు సేయుచు రాఘవుల డాసె. రాముఁడు విశృంఖలవృత్తిం జనుదెంచు రాక్షసవీరుం దిలకించి కోపంబునఁ జాపంబుసారించి 'నాదిక్కు నిలు' మని గంభీరంబుగ గర్జించె. కుంభకర్ణుండు వెడనవ్వు నవ్వి వానరులఁ జేరనీక యదలించి "రామా! నీచేఁ బడ వీఁడు విరాధుండుగాఁడు! ఖరుఁడుగాఁడు! కబంధుండుగాఁడు! మారీచుఁడుగాఁడు! వాలి గాఁడు! నిను మ్రింగవచ్చిన యొక్కటిశూరుండు కుంభకర్ణుం డౌఁడు! నీవస్త్రసంపదయందు నేర్పునం దసమానుండవఁట!

కావునఁ గొంతసేపు నీ రణంబు సూచి పదపడి నిన్ను మ్రింగె
దను" అని సోల్లుంఠనోక్తులాడిన రాముఁడు దృఢముష్టిసారించి
శితశిలీముఖంబుల వానిమేన నాటించి సప్తసాలంబుల వాలిని
గూలిచిన సాయకంబులనేసి వాఁడు చలింపమి కచ్చెరువొంది
తనదేహమునుండి వెలువడు రక్తధారలఁ దానవాన మొన
ర్చుచు గద ద్రిప్పికొనుచుఁ బైకుఱుకు దనుజుంగని రౌద్ర
రసోల్లాసమూర్తియై రయంబున వాయవ్యాస్త్రంబు సంధించి
విడిచిన నది వాని వలచేతిం దునిమె. కపు లనేకులు వాని
హస్తంబు క్రిందఁ బడి నుగ్గునూచమైరి. తదితరు లా కదన
భూమి నుండ భయంపడి దవ్వులకుఁ బాఱిరి. రామాస్త్ర
నికృత్తబాహుండై కుంభకర్ణుండు కులిశపాత భగ్నకూటంబైన
మహాచలేంద్రంబుభంగిం జూపట్టుచు బీఱువోక యెడమచే
నొక్క మహోత్తాలసాలంబు పెఱికికొని రామునిపై నడరిన
నమ్మహాతుండా భుగ్నభ్రుకుటియై యైంద్రాస్త్రమున గరుడ
తుండహతిం గూలు భుజగముగతి డాపలికరంబుం దెగనేసె.
అక్కరంబు కరంబురవడిఁ దన మునుముననున్న మహాశిలలు
చూర్ణంబులుగాఁ బాదపంబులు పొడిగా దిగువంబడియె.
పాఱిన వనచరరాత్రించరులు పాఱఁగాఁ గొంతబీరంబున నుం
డినవా రా చేతి క్రిందఁ జిక్కి యంత్రంబున నడుమఁబడు తిలల
చందంబున నైరి. అంత భిన్నబాహుండై మహానాదంబు
యుచు వదనగహ్వరంబుఁ దెఱచుకొని మ్రింగవచ్చు

వీదుని పదద్వయంబు నినకులవర్ధనుం డర్ధచంద్ర ప్రదరంబులం
దునిసిపడఁగొ౦. అప్పటికిని వాఁడు పొరలుచు రామునిపైకి
వచ్చుచుండ వావిలూనకరచరణుండైన యామినీచరశేఖరుని
వదనంబునఁ బెక్కు నారాచంబులు నిగిడించి సందీప్త పావక
సంకాశంబును వాయుసమవేగంబును బ్రహ్మదండాంతక పాశ
కల్పంబును నమోఘంబునైన యైంద్రాస్త్రమురివోసి యాకర్ణాం
తము లాగి విడువ నది మంటలు గ్రక్కుచుఁ బోయి మహా
పర్వతకూటసన్నిభంబును వివృత్తదంష్ట్రాచల చారుకుండలంబు
నగు కుంభకర్ణుని శిరంబు కఱుక్కున ఖండించె. ఆశిరంబు
కర్తనవేగంబున మింటికెగసి లంకాసాల హర్మ్యపంక్తిం గూలఁ
ద్రోచికొనుచు రక్కసు లిదియేమని బెదర లంకదాఁటి దక్షిణ
సముద్రంబునఁబడి బుడబుడశబ్దంబులతో జలముగ్రోలి బడబాగ్ని
చే జడధియుడుకుపట్టినానొప్పె. ఒక కోటి కపులు రాక్షసులు
చదియఁబడ నతనిదేహంబు సగము లంకలోనికి సగము సము
ద్రము లోనికిఁ బడి జలచరంబులఁగూడఁ జరిమివైచె. కపివీర
ప్రశంసావాక్యములతో రాముఁడొప్పారె. హతశేషు లురవడి
లంకకుఁబాఱి రావణునకుఁ గుంభకర్ణుని పాటెఱింగింప నతండు
బిట్టుమూర్ఛిల్లి చాలసేపటికిఁ దెలిసి,

ఉ. "ఆలములోన భ్రాత బలి

యైతె? నిశాచరవీర! నిర్జరుల్

కెలిగొనఁ బులస్త్యకుల
కేతువ! రామశరానిలంబునఁ
వ్రాలితె? కైకసీ తనయ!
నాదగు దక్షిణబాహుశాఖ భూ
పాలుఁడు త్రుంచెనే? యిటు వి
పద్దశఁ ద్రోచితె నన్నుఁ దమ్ముఁడా!

ఆ. వె. ఇంక నీవులేని యీ లంక నాకేల?
సీత చింతయేల? జీవమేల?
సంగరమున నిన్నుఁ జంపిన రామునిఁ
జంపఁదగదుగాక చావఁదగదె?"

అని పలుదెఱంగుల విలపింపఁ ద్రిశిరుఁ డనేకవిధంబుల నాశ్వాసించి సేన నరవానరుల నిర్జించి సీతగ దీర్తునని యనికిఁ గదలె. వానివెంట రావణుఁ డతికాయ దేవాంతక నరాంతక మహోదర మహాపార్శ్వులఁ బుత్తెంచె.

వారికి వీరికి ఘోరంబగు పోరయ్యె. విఱిగిన రథములు నొఱిగిన తురగములుఁ ద్రెళ్లిన కరటిఘటలుఁ దెఱపిలేక పడు నిశాటవానర శిరఃప్రతతులుఁ బుఱియలు పఱియలైన నుఱుకు మస్తిష్కరక్తపంకపల్వలములు నఱుమైన తరుశిలాసంచయంబులు తునిఁగిన కైదువులుఁ బ్రేవుల ప్రోవులు గలిగి సమరభూమి దుర్గమమార్గమై యొప్పె. అంత నరాంతకుండు చెలరేగి శక్తిచేచి సప్తశత మర్కటవీరులఁ గూల్చి తదితరులం

ఝడలుపడఁ బెక్కుకోల లేసిన నంగదు సుగ్రీవుని వెనుకకుఁ బాఱిరి. సుగ్రీవుని సన్న యెఱింగి వాలిపుత్త్రుండు వడిం బఱ తెంచి "యోరినిశాచరాధమా! అల్పులఁ గొందఱనోర్చి గర్వింపఁజనదు. అదె నీవలచేతిప్రాసము. ఇదె నాఱొమ్ము. వైవు" మనవుడు నా నరాంతకుం డలుకమెయిఁ బ్రాసంబు వైచె. అది యంగదుని యురంబు దగిలి తుమురైన నతండు నవ్వి పిడికిటిపోటున ఘోటకంబులఁ గీటడంచిన, వాఁడు నంగదుపైకి లంఘించి కఠినముష్టిం బొడువ నొడలుదడియ వెడలు నెత్తుటితోడ వాలికొడుకు మూర్ఛనొంది తోన తెలిసి యశని సంకాశంబగు ముష్టిఘాతంబున నరాంతకుం బొడువ వాఁడు రోఁజుచుఁ గూలి విల విలఁ దన్నుకొనుచుఁ జచ్చె.

వానిపాటునకుఁ గుపితులై దేవాంతక మహోదర త్రిశిరు లంగదుం గ్రమ్మి యెక్కుమ్మడి నానావిధాయుధంబుల నొప్పించిరి. వాలిపుత్త్రుం డంతయుం జలింపక మహోదరు నేనుంగుం జంపి వానిపాట్ల వగులఁదన్ని దేవాంతకుని నెత్తురు గ్రక్కునట్లు గుద్దె. వాఁడు కొంతవడి సొమ్మసిల్లి తెలిసి పరిఘంబున మోఁదె. వెంటనే త్రిశిరుం డిషుత్రయంబున నంగదు లలాటంబు నొవ్వనేసిన హనుమంతుండు పరుషరోష మెసఁగ దేవాంతకు పైకి లంఘించి వానిశిరంబుల లెక్కగొనక నడు నెత్తి వ్రయ్యఁ బొడువ వాఁడు పండ్లుల కఱచికొని నాల్కవెడల రోషఘటిత కుటిల భీషణ భ్రుకుటితోఁ బుడమిం బడి చచ్చె.

నీలుండు పగిలినపొట్టతో సంగదుం గొట్టవచ్చిన మహోదరుం
దాఁకి మహానగంబొండు వానిపై వైవ దానితో వాఁడు జీవ
సమాధినొందె. వాఁడుపడుటఁజూచి త్రిశిరుండు రోషకషాయి
తాత్ముండై పండ్లుదీటుచు హనుమన్నీలురపై సంపవాన గురి
యించిన హనుమంతుండు రెట్టించినయలుకను వానిపైకిదుమికి
యొక్కపోటున వాని యురస్స్థలింబొడిచి సొమ్మసిల్లిన వాని
చేతి కృపాణ మంకించుకొని రాక్షసావలిం దఱుమఁజొచ్చె.
అంతలోఁ ద్రిమస్తకి తెలిసి పలలాశనులఁ దనకత్తితో నఱకు
చున్న కరువలికొడుకుంగని పిడికిటఁ బొడిచె. దానికిఁ గొంత
మైమఱచి తెలిసి తిరుఁగబడి గాద్పుపట్టి వాని మూఁడుతలలఁ
బఱపఱఁ గోసి పాఱవైచె.

అవ్విధంబుగని మహాపార్శ్వుండు రోషవిషాదంబులు
పెనగొనఁ బెనుగద గొని వనచరావళిం గవిసె. వానిని ఋష
భుం డెదిరించి వాఁడు వ్రేసిన గద సైరించి యొక్కపెట్టున
త్రోలుచు నేలగూలఁ బొడిచి మడియించె. తనవారిపాటుంగని
యతికాయుం డతి కుపితుండై తన బాణానలంబున వనచర
నాటవిం గాల్పఁదొడంగిన వానింగని వానరులు 'రామ
కోదండ నిర్ముక్తసాయక నికృత్తకరచరణుండైన కుంభకర్ణుండు
మరల సప్రాణుండై లేచివచ్చెనొక్కొ' యని తింగలంగి
పఱచి రాముని వెనుకఁజేరిరి. రాముఁడు వారల వెఱవకుఁ
డని యభయంబు చెల్పి వి షణుంగని వీఁడెవ్వఁడన నతఁ డిట్ల

నియె. "దేవా! వీఁడు దశాననునకు—ధాన్యమాలినికి జనించిన వాఁడు. తేజోబలవీర్యంబులఁ దండ్రిని, ఘనకాయంబునఁ గుంభకర్ణుని బోలువాఁడు. ఈ యతికాయుండు విరించి నారాధించి యవధ్యాశ్వసహస్రంబగు వరదంబును నవార్యంబులగు ననేకాస్త్రంబులఁ బడసినవాఁడు. నీతిమంతుఁడు. వీఁడు లంక కొక పెట్టని కోటవాటంబున నుండు మేటిమగండు. వీనియెడ నధికయత్నంబు సేయునది కార్యంబు" అనుచున్నంతలో మైంద ద్వివిద నీల శరభ కుముదాదుల సొమ్మసిల్లఁ గొట్టి యతికాయుండు రాముని సమీపించి,

మ. "శరచాపంబులు కేలఁబూని రథినై
సంగ్రామ మర్థించి భూ
వర! నీపైనిదె వచ్చినాఁడ మొదలన్
వారాశిపై వాలిపై
ఖరుపై నేసిన కోలలేయుమిటఁ జ
క్కంగమ్ము నాయమ్ము లిం
కొరుపైఁ బోలవు దేవదానవ జయో
ద్యోగాభిమానంబునన్"

అనిన లక్ష్మణుం డప్పలుకుల వినన్లోలక వాని కభిముఖుండై గుణంబు సారించిన వాఁడు నవ్వి "పిన్నవారిపై దయగల యీ యతికాయుండు నుదువు నుదువు లాకర్ణింపుము. సౌభ్రాత్రంబున వచ్చి చావ నుంకింతువేల? కేలఁ గీలొడ్డమా

ఖేల లీలాలోలంబై నీ యసువులఁ గ్రోల నాలుకలు వ్రేలఁగాల
వ్యాళంబులఁ బోలియున్న నా శిలీముఖంబులఁ గనుము"
అనిన లక్ష్మణుండు సక్రోధంబుగా నవ్వి "విల్లుఁ గేలఁదాల్చి
వీఱిఁడి మాటలాడిన ఫలమేమి? మాటలందు మగతనంబు
గలదే? నీ కేవిద్యయందుఁ బ్రావీణ్యముగలదో దానిఁ జూప
రాదే? శరీరమహత్త్వంబునంజేసి నీ వధికుండవైన బాహు
విక్రమంబున నీకుఁ బిడుగువంటివాఁడ" అని పుంఖానుపుంఖ
ముగ శరాసారంబు గురియించిన నతికాయుండు వానిని
వారించి లక్ష్మణునొవ్వనేసిన నతండలిగి మూఁడు వాఁడితూ
పుల వాని నుదురంటనేసె. బలే శూరుఁడ వౌదువని యతి
కాయుండు శరవర్షము గురిసిన రామానుజుం డర్ధచంద్రాస్త్ర
మున నవ్వాని నాపి మహాస్త్రయుద్ధంబు గావించిన వాఁడును
మహాస్త్రంబుల సమర్థ్యంబుసూపి కొంతతడవు పోరె. తుదకు
లక్ష్మణుం డతిరౌద్రమూర్తియై బ్రహ్మాస్త్రమ్ము వింటసంధించి
తెగదీసి విడిచిన నయ్యస్త్రరాజంబు వానికంఠంబు గత్తిరించి
బొమిడికముతోడ శిరంబును వసుంధరం గూల్చె. రామసుగ్రీవ
విభీషణులు ప్లవంగపుంగవులు సాధువాక్యంబుల లక్ష్మణు
వర్ణించిరి. హతశేషులైన దోషాచరులు విఱిగిపాఱి లంకసొచ్చి
రావణునకు యావద్వృత్తాంతము నెఱుకపఱచిరి. దశకం
ఠుండు కుమారుల మరణంబునకుఁ గడుంగడు వగచుచుండ
నింద్రజిత్తు ధీరోక్తులువల్కి నరవానరులఁ జంపికాని రణంబు
నుండి మరలనని ప్రతిజ్ఞచేసి తండ్రిం దేర్చె.

## మూఁడవనాఁటి రాత్రియుద్ధము

### —:ఇంద్రజిత్తు:—

జనకునిచే ననుజ్ఞాతుండై మేఘనాదుండు చతురంగ బలసమేతుండై సమరభూమిం బ్రవేశించి యుచితప్రదేశంబునఁ దేరుడిగ్గి చుట్టును గాపుంచి యట నగ్నిప్రతిష్ఠాపనంబు సేసి సమంత్ర తంత్రకముగ వ్రేల్చి బ్రహ్మాస్త్రము నావాహనచేసి యందుకొని రథారోహణంబు చేసి స్యందనసహితుండుగ నదృశ్యుండై మేఘంబుల డాఁగె. మిగిలిన రక్కసులు కపులతో సంకులసమరంబు గావించిరి. ఆ తరుణంబున మేఘంబులనుండి మేఘనాదుండు మేఘగర్జాభంబుగ నార్చి శరవర్షము గురియించెను. అతని చండకాండపాతిని వలీముఖులు రామ రామ యని వాపోవుచుఁ గూలుచుండిరి. హనుమదాది మహావీరులు మింటికెగసి శత్రుంబొడగానలేక మహాస్త్రములచే భూపతితులైరి. తదీయ శరవేగంబు సహింపక రఘువీరుండనుజుంగని "లక్ష్మణా! నేఁడు శత్రుండు విరించనాస్త్రంబు నాశ్రయించుటంజేసి యజయ్యుండై ప్లవగసైన్యము దైన్యము నొందఁజేసి మనల బడలుపఱచుచున్నాఁడు. అయ్యమోఘాస్త్రం బఖిలజగత్పూజ్యమగుటచే మనకును బూజ్యంబ కావున నవ్యగ్రమతివై బాణావపాతంబులు నావలె నోర్చి యుండుము. నివృత్తయుద్ధులమై గతరోషహర్షులమై పడిన

మనల విలోకించి రణాగ్రలక్ష్మిం దోడ్కొని లంకకుం జనం గలం” డని పలికి లక్ష్మణసహితంబుగాం దా నింద్రజిదస్త్ర జాలబద్ధుండై యుండె. పడిన నరవానరులనెల్ల నాలోకించి జయభేరి వేయించుచు నింద్రజిత్తు లంకాపురిం బ్రవేశించె.

అంత బ్రహ్మాస్త్ర మంత్రజపంబున నస్త్రపాతంబునకు దప్పిన విభీషణుండు తదాచరణ శరణుండైన యాంజనేయుం గనుంగొని “యంజనానందనా! నర వానరులగతి యిట్లయ్యె. జాంబవంతుంగని తరువాతి కార్యం బాలోచింతము ర” మ్మని కొఱవియొకటిగొని సప్తషష్టికోటి వానరయూథాధిపతుల విలోకించుచుం బోయి యొకచో శరశతాచిత సర్వగాత్రుండై శాంతినొందిన పావకునివడువున రణమేదినిం బడియున్న జాంబవంతు నవలోకించి మెల్లన నుపసర్పించి “నేను విభీషణుండను. మహాత్మా! తిగ్మంబులైన శరంబులం జావకుండం బ్రాణంబులు రక్షించుకొనియున్నవాండవే?” యన నతండు “నాయనా! విభీషణా! కనులనిండ నమ్ములు గ్రుచ్చుకొనుటచేం జూడం జాలక కంఠస్వరంబున నిన్నెఱింగితి. అయ్యో! హనుమంతుండు సజీవుండేకదా!” యనియె. విభీషణుం డచ్చెరువంది “తాతా! రామ లక్ష్మణ సుగ్రీవాది మహాత్ములుండం గీశచమూగణ నాయకులుండ హనుమంతునే మొదట నేలయడుగుచున్నా” వన నతండు “నాయనా! మారుతి ప్రాణయుక్తుండైన నెల్లరుం జావనివారలే. అతండు తీఱిన నందఱము తీఱనివారమయ్యు”

దీజీనవారమ–యనినఁ బావని యితనికి స్వనామోచ్చారణ
పూర్వకంబుగాఁ బ్రణామం బొనరించిన నతని గాఢంబుగఁ
బరిరంభించి తన్నుఁ బునర్జాతునిగాఁ దలంచుకొని లేచి "మారు
తాత్మజా! నీ బలమంతయుఁ జూడ వేళవచ్చె. జగత్ప్రాణ
నందనుండవు. ఎల్లరకుం బ్రాణంబులీయు నోషధులఁ దేవ
లయు. సూర్యోదయంబునకు మున్న యీ పని యొనరింప
వలయు. సముద్రము దాఁటి హిమవంతంబు నతిక్రమించి
యావల వృషభ కైలాస శైలంబుల మధ్యంబునఁ గంటివేని
యోషధినగం బగపడఁగలదు. అందుఁ బ్రకాశవంతంబులై
సంజీవకరణి సావర్ణ్యకరణి సంధానకరణి విశల్యకరణి యను
నాలు గోషధులు గలవు. వానిం గొనిచ్చి నరనాథుల
వానరనాథుల బ్రదికించి యశంబు గైకొమ్మా" యనియె.

—:హనుమంతుఁ డోషధిపర్వతంబు దెచ్చుట:—

జాంబవత్ప్రేరితుఁడై మరున్నందనుండు ప్రావృట్కాల
వలాహకంబుకరణి మేను వెంచి విజృంభించి విలయపవనుని
మాడ్కి వేగం బంగీకరించి బలంబు దీపింపఁ బర్వకాల సము
ద్రంబుభంగి నుప్పొంగి సముద్రతటాగ్రస్థంబైన యొక్క పర్వ
తంబు నెక్కి యది క్రుంగ నింగికెగసి పతంగపుంగవుభంగిఁ
జెలంగుచు రామకరాగ్రముక్తంబైన శరంబువైఖరిఁ బిత్రు
తుల్యవేగంబున జాంబవదుక్తపర్వతం బతిక్రమించి చని బహు
దూరం బరిగి మరల నెఱిఁగి మరలి యోషధిశైలముఁ గాంచి

విస్మయసమ్మోహంబులు సంధిల్ల డిగ్గి యందు నోషధుల వెదకుచుఁడ నయ్యవి యదృశ్యంబులయ్యె. కోపంబున నతండు "రఘుకులాంబుధిచంద్రుని రామచంద్రునిపైఁ గృప మాని యీ తీరున దాఁగిన నిన్ను విడిచి చనుదునే? జనులు ఘనులచొప్పెఱుంగ నేర్తురే? గాడుపుట్టిఘనము నట్లు నిన్ను మూలముట్టుగఁ గొనిపోదు" నని వాలము పెంచి గిరిచుట్టుం జుట్టి కూటములు విఱిగి కూల రామభక్తిమై సాహాయ్యం బుగ నన్నగేంద్రముం బెకలించి యఱచేతఁ బెట్టికొని దేవత లుబ్బియాడ గొబ్బున నెగిరి సుపర్ణవేగంబున వచ్చుచుండె. దూరమునవచ్చు హనుమని గని కపులు సింహనాదంబులు గావించిరి. సంతోషవిశేషంబున విజయం చాటించుచు తలంపున నా మారుతి మహాస్వనంబుచేసి యప్పర్వతంబు వనచరసేనామధ్యంబున నునిచి జాంబవదాదులకు భక్తిం బ్రణమిల్లె. రాఘవులును వానరబలంబును దన్మహౌషధి గంధాఘ్రాణంబున విశల్యులై విరుజులై సుప్తులు నిశాంతంబునఁ బ్రబుద్ధులగుచందంబున నందంబు వహించిరి. ప్రతిదినంబును రణంబునఁగపిగణంబులచేఁబడి నిహతులైన పిశితాశనుల విచారించి తత్పరిగణనార్థంబును ననేక రాక్షసహితంబును సర్వజనులెఱుంగుదు రను దురభిమానంబునను రావణుండు మృతులైన రాక్షసుల కాయా దినంబునను దధిలోఁ బాఱవేయించుచుండెఁ గావున నద్దివ్యౌషధి గంధాఘ్రాణంబున బ్రదుక

రాక్షసుఁ డొక్కఁడైన లేఁడయ్యె. నాఁడు హతులైన రాక్షసుల విభీషణ జాంబవదాదులు హనుమ వచ్చుటకు మున్నుగ వారధింబడనైచిరి గాన వారును సజీవులు గా వీలులేదయ్యె.

—:లంకాదాహము:—

హనుమ యెప్పటియట్లప్పర్వతరాజం బునిచివచ్చె. తదనంతరము సుగ్రీవుండు హనుమంతు నవలోకించి "మతిమంతా! మమ్మెల్లర బ్రదికించి నిజముగ జగత్ప్రాణనందనుండవైతివి. నీఋణంబుదీర్ప మాకీ జన్మంబు చాలదు. నేఁడు రావణుండు నిహతులైన నందనులం దలపోసి దుఃఖమోహంబులఁ దూలి యాలంబునకుఁ బూనఁడు. కాన వాని కలుకజనించునట్లు లంకంగాల్ప వానరవీరుల కనుజ్ఞఁ దెలుపుమా!" యనుడు నట్లగుఁగాక యని మరుత్పుత్త్రుండు కపివీరులం బురికొల్ప వారు నిర్విశంకులై లంకకుఁ జని కాల్పందొడంగిరి. రథ గజ తురగ ధాన్య ధనశాలలు భస్మీపటలంబు లయ్యెను. శివుని లలాటదేశంబు విడిచి కృశానుండుద్ధతితో లంకఁజొచ్చి కాల్పఁ దొడంగెనాఁగ జలంబుద్రావ వేసరి బడబానలము పురదాహంబొనరింపఁబూని పోదివె నామంటలు ప్రజ్వలించి (శ్రీ)రాముని తేజమువోలె మండెను. వానరరోమసముత్థుఁడోయన వైశ్వానరుం డేపున దెసలనెసఁగె. సుగంధద్రవ్యములు మంటఁ గలిసె. రత్నరాసులు చిటిలుపెటిల్లుమని పేటిలె. అంబరాదులు బూదియయ్యె. ఆయుధంబులు కాలి కరుల్లగక్రై! రక్ష (శ్రీ)

పురుషు లెందఱో కూలిరి. బాలికా బాలకు లెందఱో భస్మ
మైరి! కొందఱుపాఱిరి. "నీపాపఫలంబు మేమెల్లర మనుభ
వింపవలసి వచ్చెఁగదరా నీచా!" యని రావణుం గొందఱు
దూఱిరి. దశాస్యుండు కుంభనికుంభులఁ బిలిచి యీ వానర
బాధను మాన్పిరండని పంపెను. "దశాస్యుజనంబుల గవఁకుల
దాఁటనిచ్చిన వారిం బ్రశాస్యులఁగాఁదలఁతు" నని సుగ్రీవుండు
కపులకుఁ గట్టడచేసెను. సురిఁగెడు వారిని గొందులకుఁజొచ్చు
వారిని నాతురమునఁ బాఱువారిని గ్రంతలందిరిగెడువారిని
దూరమేగినవారిని మఱుఁగులఁ దిరుగువారిని బైఁబడవచ్చిన
వారినిబట్టి శవరు లా కృశానుని మంటలోఁ ద్రోచుచుండిరి.
అంత దాశరథుల ముఖారవిందంబు లలరుటయు దానవీజన
నేత్రకువలయంబులు వాడుటయుఁ జూడ నేతెంచు కరణిఁ
దరణి యేతెంచె. నిత్యకృత్యముల నిర్వర్తించుకొని నీరేజాప్త
వంశు లు నిర్జరారాతి నిధనోద్యుక్తులై నిశాత శరశరాసనం
బులఁ దాల్చి నిలిచిరి.

—:నాలవనాఁటి యుద్ధము:—

కుంభనికుంభులతో నిలింపకంపనుఁ గంపను శరలూన
వైరిజంఘుఁ బ్రజంఘు విఘూర్ణిత భీషణావృత్త శోణితాక్షు
శోణితాక్షుని దశకంధరుండు కదనంబునకుఁ బంపె. వారలు
రథ గజ తురగ పదాతులతో వీరోచిత వేషములతో వివిధ
వీరణములతో విక్రమాట్టహాసములతోఁ గదలి వలీముఖులఁ

డాఁకిరి. వారికి వీరికి నెక్కటికయ్యంబయ్యె. ఒక్కొక్క కపి యొక్కొక్క యసురుం దలపడియె. పొడుచుచుఁ బట్టుచుఁ దన్నుచు నొడుచుచు విసరివైచుచు నుదీర్ణవారక్రములై జయైక కాంక్షులై వారు వీరు పోరిరి. కంపనుం డంగదునితో సంగ రంబుచేసి నొప్పించిన, సమయంబు గనిపెట్టి యంగదుం డొక కొండ వానిపై నేసి యసురులు కంపింపఁ గంపనుంజంపె. క్రోధనుండు క్రోధమూర్ఛితుఁడై యంగదుని గదతో వ్రేయ నతం డొక శైలశిఖరంబుగొని వానినేసె. వాఁడు దానిం బిడి కిటఁ జూర్ణంబుచేసి కత్తియుఁ బలకయుఁ గొని యంగదుపైకి లంఘింప నతం డా కరవాలం బొడిసికొని దానితో వానిని గాలుప్రోలికిం బంపి యసమ సమరసాహస సముత్సాహంబున నమరవైరుల సమయింపం గడంగిన శోణితాక్షుం డెయిది బెడి దంబులగు *తూపుల నొప్పించిన వాని రథరథ్యంబుల నుగ్గుచేసి వానిం బొదివి పెనుమూర్ఛ నొందించె. అంత వానికి బాస టగాఁ బ్రజంఘయూపాక్షులు పఱతేర నంగదునకు మైంద ద్వివిదులు సాహాయ్యకంబొనరించి వారిందాఁకిరి. ఇంతలో శోణితాక్షుండు తేటి వారిందలపడె. మించిపైకివచ్చు ప్రజం ఘునిఁ గన్నుల మిడుఁగుఱు లుప్పతిల్లఁ బిడికిటఁ బొడిచి యంగ దుండు సమయించె. పినతండ్రిపాటు గని శోణితాక్షుండు చెల రేఁగ ద్వివిదుండు వానిఱొమ్మునఁదాఁచి శిరంబును బూఁగాఁడ వలె గిల్లిపాఱవైచె. తమ్మునిపాటు గని యూపాక్షుఁ డుద్ధతిని

రణవ్యగ్రాగ్రహోదగ్రుఁడై చనుదేర మైందుండు వాని బాహు బలంబునఁ బట్టి వపువ్రుగుల్లల త్రిత్రిగా నుదికిచంపె. రక్కసులు పాఱఁదొడంగిరి.

అట్లు పాఱనారంభించిన నిశాచరవీరులఁ గుంభుండు మరల్చుకొని రోదోంతరంబు నీరంధ్రముగా బాణపరంపరలు గురియించుచు వానరవీరులఁ దఱుమఁజొచ్చె. వాని యుద్రేకముంగని సహింపక సుగ్రీవుండు నిలునిలు మని యదల్చుచుఁ బొదివిన నతని నొవ్వనేసి మైందద్వివిదాంగదుల చేష్టలుడిగించి కుంభుండు మీఱిన తేజంబునఁ బొలిచిన సుగ్రీవుండు వాని శతాంగతురంగంబులమీఁదికిఁ జెంగఁగొని చదిపి వానిం బట్టుకొన నిరువురకు మల్లయుద్ధంబు ప్రాప్తించె. గంధసింధుర ద్వయంబు విధంబున డంబుమీఱి యిరువురు కొంతతడవు పోరిరి. కట్టకడకు సుగ్రీవుండు కుంభునొడిచికొని త్రిప్పి యంబుధింబొఱవైచె. పాఁడటనుండి వెడలివచ్చి సుగ్రీవు నురంబు ముష్టితలంబునఁ బొడిచి విస్ఫులింగము లురలించిన నతండు కినిసి లయకాలాంతకు కాలదండంబుంబోని యుద్దండ భుజాదండం బెత్తి శాతిన్యాపహాసితభిదురంబగు తదీయోరస్థలంబు బిట్టేసినఁ గుంభుండు గతప్రాణుండయ్యె. తక్కినరక్కసు లుక్కసెడి దిక్కుగానక చిక్కువడి నికుంభుని మఱువుసొచ్చిరి.

నికుంభుండు మండిపడి గదగొని రోదోంతరంబు మేదురితంబుగాఁ బంచిన బొబ్బలిడుచు సుగ్రీవుపైకి నడతెం

చిన వాయుపుత్త్రుం డెడసొచ్చి వానికి వక్షంబు విచ్చి చూపుచు నిలిచె. వాఁడు సరోషుండై గదవైవ నది పావని వక్షంబు దాఁకి పొడి పొడియై పుడమిం బడియె. ఇఁక నా దెబ్బఁ జవి చూడుమని పిడికిటిపోటున వాని వక్షంబుం బొడిచిన నెత్తురు గ్రక్కు సోలి తెలిసి హనుమం బట్టి యెత్తి విసరి కొట్ట నుద్యమించెను. అతఁడు చాకచక్యంబునఁ దప్పించుకొని వాని నెత్తి యుదికి యెమ్ములు భిన్నంబులుగాఁ జదిపి బొమ్మపై నిలిచి మెడ ద్రిప్పి శిరంబు ద్రుంచి లంకలోఁ బడునట్లులు విసరివైచె. అతని రౌద్రకర్మముం గని నిశాచరులు దెసలకుఁ బాఱి లంక సేరి రావణున కా యుదంతమంతయుఁ దెలిపిరి.

శోకరోషభరితుండై పంక్తికంధరుండు ఖరుపుత్త్రుని మకరాక్షుని జూచి 'ససైన్యుండవై పోయి యా నరవానరాధములఁ గ్రధనంబున నిధనంబుగావించి రమ్మ'న నతండు ధనుర్ధరుఁడై సజ్జరథుఁడై చతురంగయుతుఁడై పొలికలనికి నడచి సైన్యంబున కుత్సాహంబు రెట్టింప "మీరు మర్కటమూర్ధంబులఁ దునిమి వలసినంతనల్ల ద్రావుఁడు. ఏను దివిరి రాఘవుల సుగ్రీవుని వానరయూథపుల సంహరించి తండ్రి పగదీర్తు" నని ఉక్కులు పిక్కటిల్ల నార్చుచుఁ గపివరులఁ దాఁకి కసిమసంగి యడిదములఁ దలలు గూలనేసి వేనులుచ్చిపోవ నారసంబుల నాటించి ముసలంబులఁ గసిబిసిగా

మొత్తి పరశువులతో నఱికి మూరి మసఁగిన యనువున వన
చరావలిం బాఱి సమరిన వార లతనిధాటి కాఁగలేక వడిఁ
బాఱి రఘురాము మఱుఁగు చేరిరి. ఇనవంశభూషణుం డతి
భీషణుండై తఱుముచు వచ్చు రక్కసుల నదల్చి తునిమి
నుగ్గుచేసి తోలి రూపఱఁజేసిన మకరాక్షుం డతి త్వరితగతి
రథంబు రాముదిక్కునకుఁ బఱపించి రోషారుణితనయనుండై,

శా. వీరాగ్రేసరు నస్మత్కిరుజనకున్
విఖ్యాతసత్త్వైక ఖరున్
ఘోరంబాపితి నామనంబెరియు నే
ప్రొద్దున్ నరాధీశ! నా
నారక్షస్తతి నేచి చంపితివటన్
నాపాలి భాగ్యంబునన్
జేరంవచ్చితి వెందుఁ బోయెదవు నా
చేఁ జిక్కితింకన్ వెసన్.

క. మనిచెద నామానాంగము,
నినిచెద భువనములఁ గీర్తి, నిష్ఠురగతితో
ననిచెద నిను జముప్రోలికి
నునిచెదఁ బౌలస్త్యసుఖము లోగిఁబొందంగన్.

ఆ. వె. ఖడ్గశక్తినైన గదనైనఁ జేతుల
నైన వింటనైన నరసిమూడఁ

గడ.గి నీకుఁ బోరఁ గా నేర్పు మిక్కిలి
యెంచుఁగలదు దాని నే నెరిఁగెదనుమ"

అని వీరాలాపంబులాడి శితశిలీముఖ సహస్రంబులు రాముని మేను నాటనేసిన నమ్మహాత్ముం డన్నిటి కన్ని తూపులేసి వాని విల్లు దునిమి సారథిం బొలివుచ్చి హయంబులతో రథంబును నుగ్గునూచముగావించిన వాఁడు విరథుఁడై బీభత్సక శూలంబు కేల నంకించుచు డగ్గ నా శూలంబు నలందు విఱుగఁగొట్టె. మకరాక్షుండు ప్రళయాంతకుఁడై వడిఁ గుపితుండై యడరి ముష్టిఘాతంబున రాము నురంబుఁ బొడువ వడి నేతేర నతం డాగ్నేయాస్త్రంబున వాని యురంబున దూఱి వీఁపున దుస్సి భూమిం బాఁదునట్టులు కొట్టిన వాఁడు బొబ్బరించి యిలఁ గూలె. హతశేషులు పాఱి పంక్తికంఠున కవ్వార్త యెఱింగించిరి. అతం డింద్రజిత్తుం బిలిచి 'యీసారి నీవ పోయి నీ బలంబు మెఱయ నరవానరులఁ బొలియించి ర' మ్మనియె.

—:ఇంద్రజిత్తు మూఁడవయుద్ధము:—

శా. రక్షోనాయకనందనుండు సమరా
రంభోగ్రుఁడై వాహినీ
లక్షల్ వేచనుదేర సత్వర విలో
లత్సైంధవ స్యందనం

బాణోగ్రత నెక్కి రేణు సముదా
యాంధీకృతామర్త్యుఁడై
సాక్షా దంతకుఁడో యనంగదలె నా
శాచక్ర మల్లాడఁగన్.

ఉత్తరపుగవనిం గడచి దనుజులఁజట్టు నిలువ నియమించి రథంబు దిగి స్మశానాగ్ని వ్రేల్చి యందొక కృత్తిని బుట్టించికొని దానవుల లంకకంపి దాను కృత్తితో నరదంబెక్కి యదృశ్యుఁడై నిష్ఠురగతి వలీముఖులపై రాల వాన గురియించె. కరకలికు దుల్లిన తాళఫలంబులఁబోలె వనచరుల తలలు నేలఁబడుచుండె. అంగదాదివీరులు వైచు వృక్షశిలాచయంబు లిట్లే క్రమ్మఱి వచ్చుచు వీరినే నొప్పించుచుండె. గాలికైనఁ జొరవయీక శరపరంపరలు వర్షధారలవలె వచ్చి వానరవీరుల వీతసత్త్వులఁ జేసి గూల్చుచుండె.

సీ. పిడుగులాకో కావు ఽ పొడతేవు ఘనములు
లాకాల సహస్రంబులో ఽ కావు ధరణి
యడలదుకాల స ఽ ర్పావళులో కావు
పాతాళవివరంబు ఽ బయలుపడదు
ఖరమైన ముక్కంటి ఽ కంటిమంటలో కావు
జగదవసానంబు ఽ జాడలేదు
కాలకూటార్చులో ఽ కావు మందరగోత్ర
మానితాంభోరాశిఁ ఽ గానఁబడదు

మొదలెఱుంగరాదు ౯ మునుకొనిపుట్టిన
చొప్పు దెలియరాదు ౯ చూడనెచట
నని కపీంద్రు లిట్లు ౯ లాజిఁ దల్లడమంది
రింద్రజిత్తు తూపు ౯ లేపుమాప

వీఁడు మాయలనేరిచి నజయ్యుఁ డని తన మఱుఁగు సేరిన వానరుల నోడకుఁడని రామభద్రుం డమోఘాస్త్రంబు దెగదీసి యేసినఁ గృత్తిపాలిసె. మేఘనాదుండు తేరితో వచ్చి పుడమిపై నిలిచె. అంతఁ గపివీరులు పలంబు లద్రులవనీజంబులు గొని వానిపై వైచిరి. వాఁ డన్నింటినిం దునిమి యొక్కొక్కనిఁ బది పదునైదు సాయకముల వనచర చక్రంబునెల్ల బడలు పఱచి లంక కేగి తండ్రి కంతయు విన్నవించిన రావణుండు కినిసి "మాటి మాటికి వారిఁ గూల్చి వచ్చితినని రజ్జలాడు చున్నావు. వారు వారక విజృంభించుచున్నారు. నిన్నుఁ బంపుట యూరక వచ్చుటకే; నీవు పట్టి పట్టి నిల్చిన నిర్జరులు నిశ్చేష్టులగుచుందురు. నరవానరు లెంతవారలు? పోము-పోరిపుచ్చి రమ్ము. ఈ పరి యూరక నా యెదుటికి రాకు" మన రావణి తండ్రిని వీడ్కొని మాయచేఁ గాని మనుజనాథుల జయింపరాదని మాయాసీతం గల్పించికొని రథంబున

—:మాయసీత:—

నిడుకొని సంగరరంగంబు సేర, నతనిం గని వానరులు భయభ్రాంతులై పరిభ్రమించిరి. ఉత్తుంగ పర్వతం బొండుత్పాటించి

లీలఁ గేలఁదాలిచి కేసరిపుత్త్రుండు దాశకంఠింగదిసి వేయఁ బోయి యరదంబునే నున్న కైతవజానకిం బొడగని దిగ్భ్రమఁ బొంది యట్టె నిలిచెను.

ఇంద్రజిత్తు "వానరాధమా! యిటు చూడుము. ఈ సీత కతంబున నిన్ని పాటు లుప్పతిల్లె. ఈ రణోర్వికి దీని బలి చేసితినేని యన్నియు దీనితోఁ దీఱు" నని ఖడ్గ మంకించి మాయాసీతం దలపట్టి యీడ్చెను. అదియు "హా నాథా! రఘువీరా! అమరారియదయుఁడై నన్నిట్లు ముందలబట్టి యీడ్చి చంప నుద్యుక్తుండగుచుండఁ గా పాడరాకున్నా వేల? ఓ కపివీరులార! విడిపింపుఁడు. రామునకీ వార్త వినిపింపుఁడు" అని పరిదేవనంబు సేయ హనుమ "యోరి దురాత్మా! స్త్రీహత్య పాతకము గాదటరా! బ్రహ్మవంశమునఁ బుట్టి యింద్రజితుం డని కీర్తి నార్జించిన సీకిట్టి కృత్యంబు తగదురా!" యనుచుండఁగనే వాఁడు కృత్రిమ సీత తల నఱికి వైచెను. వాయుసూనుండు శోకార్తుండై క్రమ్మఱద్విగుణీకృతరోషుండై 'పోయినసీత పోయె నింక వీని విడువనేల?' యని తాఁదెచ్చిన పర్వతంబు బలంబు కొలంది విసరివైచెను. రథంబు తొలంగంబఱపి దానిం దప్పించి మేఘనాదుండు మేఘనాదంబు ననుకరించు సింహనాదంబు సెలంగ వానరానీకంబు రాక్షసానీకంబుపైఁ బాఱపాఁది వర్షంబు గురిసినఁ జెదరిపఱచు నిజసైన్యంబు ధైన ంబు మాన్చి వివిధాయుధంబులం బరపి కపులఁ గాంది

శీకులఁజేసె. హనుమంతుండు "మీరేల యిచటఁ నిలఁతురు? వీనితోఁబోరేల? రాముకడకుఁ బోయి యతని కిది తెలిపి యతని చేఁ గర్తవ్యముం గనుఁగొందము రం" డని వారితో మరలె.

ఉ. "నిఘ్నతతోడ వీరు కృత
నిశ్చయులై చనిరింక నేను ని
ర్విఘ్నమునన్ నికుంభిలఁ బ్ర
వీణత శత్రువినాశ కృత్రిమయో
పఘ్నత హోమకృత్యము వి
భావముతో నొనరింతు" నంచు జం
భఘ్న నిషూదనుం డరిగెఁ
బ్రస్ఫుర దర్కసమాన తేజుఁడై.

పశ్చిమదిక్కున బహుళనినాదంబువిని 'వాయుపుత్త్రున కేకీడు వాటిల్లెనో' యని నా మనంబు సందియమందుచున్నది. వేగ నీ వేగి కనుఁగొని ర' మ్మని రఘువరుండు భల్లూక రాజుం బంప నతఁ డేగి యెదురు వచ్చిన హనుమంతునిం గలిసికొని రాముని సన్నిధి కేతెంచె. హనుమ ముఖలక్షణాం బుపలక్షించి హైక్ష్వాకుండు 'కీడేదియో నుడువ నేఁడు గాడుపుఁగొడుకు నడతెంచుచున్నాఁ' డని లక్ష్మణునకుఁ జెప్పుచుండ గాలిచూలి యేతెంచి యశని నిపాత ఘోరతరమైన నిజప్రియభామపాత మును దశముఖసూతి చేసెనని విన్నవింప రాముండు విచేష్టుండై

సమీరహతి వ్రాలిన భూరుహంబు చాడ్పున సేల వ్రాలె. రాముని( గని కపులెల్ల గొల్లున మరపిల్లిరి. లక్ష్మణుండు దుర్భర దుఃఖాబ్ధి నిమగ్నుండై యన్నం దన తొడలపైకెఁ దిగి చికొని యిట్లని విలపించె.

ఉ. "సముచిత ధర్మవర్తనము
సల్పుచు సత్యదృఢ ప్రతిజ్ఞ ను
త్తముఁడగు నీకు నిట్టి విప
త్తంబగు కీడు జనించె నక్కటా!
అమలిన ధర్మమార్గము జ
యాస్పదమం డది నేఁడు వైపరీ
త్యము నిటులొందె సజ్జనుల
కాపదలుఁ సమకూడె నీగతిన్

మ. భజనీయంబను చింత లేక మదిలోఁ
బ్రాజ్యత్వమారాజ్యమున్
ద్యజనీయంబుగఁ జేసి కాఱడవులం
దద్భంగి వర్తింపఁగా
నిజమై యా పురుషార్థముం గలుగునే?
నిక్కంబుకాదే! పుర
జగన్మానిత వస్తువు ల్విడిచినఁ
సౌఖ్యంబు సిద్ధించునే?

క. ధనహీనుఁడైన పురుషున
కనయముఁ జెడుఁ గార్యసిద్ధు లన్నియు గ్రీష్మం
బున సెలయేఱుల క్రియ బహు
ధనుఁడైన నభీష్టసిద్ధి తథ్యముపొందున్.

తే. గీ. మిత్రులతనికి బంధులు మేటిసఖులు
ఘనయశఃఖ్యాతి బల ధర్మ కామములును
బరమసౌఖ్యంబు లుపభోగ భవ్యములును
ధనికుఁడెవ్వఁడు మిక్కిలి ధరణిలోన.

క. ఎదిరికివచ్చిన రాజ్యము
మది మది నటు గోలుపోయి మానము దూలం
జను రేది కాననమునకు
ముందమునఁ జనుదెంచుకంటె మోసముగలదే?

మ. సకృతి ప్రోద్ధతుఁడైన రావణునకున్
నీచేతఁ జాకుండ న
త్యకలంకంబగు సచ్చరిత్రమున ని
త్యాసక్తమైయున్న జా
నకికిం గూడని చావుగల్గె నవసా
నంబైనఁ దప్పింప నె
రికి శక్యంబునుగాదు దైవఘటనా
రిష్టంబు సామాన్యమే?"

ఇట్లు లక్ష్మణుండు శోకావేశంబునఁ బొగులుచు సన్నం దేర్చుచున్న నయ్యేడకు విభీషణుం డేగుదెంచి వారి దుఃఖమునకుఁ గారణ మారసి దీర్ఘాలోచనమున మునిఁగి దిక్కులు పరికించి యొకవంక ధూమజాలంబు పర్వుటంజూచి "రాఘవ లాలా! సీత చావమి నిక్కువము. మాయామతంత్రంబు నిర్విఘ్నంబుగ నిర్వహింప సుపర్వరాడ్జిత్తుండు చేసిన కపటోపాయమడ. వేవేగ నికుంభిలకుఁ బోయి వాని వేలిమికి విఘ్నం బాచరింపవలయు. తడవు తడయఁ గార్యంబు మించు. వాని యాగంబు సమాప్తకర్మం బయ్యెనేని వాఁ డజయ్యుండగు" నని వచింప రఘువరుండు తమ్ముని గని "వత్సా! నిన్ను సర్వదేవతలు రక్షింతురు గాత. మాయావియగు మేఘనాదుని యెడఁ గడుంగడు జాగరూకుండవై తెంపుపెంపున వాని వధింపు" మని యాశీర్వదించి వనచరులకు లక్ష్మణునకుఁ దోడుగ నుండని యాజ్ఞాపించిన, సన్ను నెలవంది కవచంబు బిగించి తూణీరంబులు ధరియించి కోదండంబు చే నంది ఘోరప్రతాపఘనుండై శారద చండభానుకరణిఁ గ్రవ్యాద సేనాతిమోహాననుండై కపిముఖ పద్మములకు హర్షమే పారఁ దేజరిల్లుచు ధర గ్రక్కదల వాయుసూతిపై నెక్కి కదలె.

—:ఇంద్రజిద్వధము:—

దూరమున వచ్చుచున్న కపిసేనం గాంచి రాక్షస వాహిని ముందునకుఁ దరలి తలపడియె. రెండు సముద్రంబు

లోకబ్ధి దీవిని ముంచవచ్చినట్లా వాహినీద్వయం బా లంకా
ద్వీపమ్మున నికుంభిలయందుఁ గ్రమ్మి పరస్పరధిక్కృతులచేఁ
బాదతాడనములచే ముష్టిఘాతములచే వాలపాశములచే
దంతనఖక్షతములచేఁ దరులచే గిరులచే ముసలముద్గరశూలాది
బహువిధ సాధనములచేఁ గ్రందుకయ్యంబు గావించె. వాలి
వాయుపుత్త్రులు మహాసాలంబులఁ గొని దానవుల గ్రుద్దులాడ
మోఁదుచు వాలమ్ముల వాదెబుగట్టి నేలకుఁ జరచుచుఁ
బోయి పోయి యాగకుండంబుఁ బూడ్చి మేఘనాదునిఁ బిడి
కిళ్ల నొవ్వఁజేసిరి. ఇంద్రజిత్తుండు కనులు దెఱచి హనుమని
విలోకించి యత్నవధంబుఁ దలంచి యుగ్రకోపవివశుఁడై
బహువిధాయుధంబులు పరఁగించి తటిమి యవశిష్టహోమంబు
పూర్తిగావింప మరలె.

విభీషణుం డదిగని "లక్ష్మణా! వీఁడు మున్నిచ్చోటనే హో
మంబు గావించి సంప్రాప్తకాముండై యింద్రు నోడించె. ఇప్పుడు
మన మాలసించితిమేని యిందుఁ జతురంగబలంబులఁ బుట్టించి
యగ్నిదత్తరథం బధిరోహించివచ్చు. అప్పుడు వాఁడు దేవ
దానవులకేని దుర్జయుండగుఁ గావున నింతలో వాని నాక్ర
మించి విక్రమించి ఘోరశరాబ్ధి ముంచి వధింపు" మని హెచ్చ
రింప లక్ష్మణుండు చండకాండంబులు మెండుగాఁ బరపి వాని
నాలంబున కాహ్వానించె. ఇంద్రజిత్తు పరిత్యక్త హోమవిధి

కలాపుఁడై యగ్నివర్ణరథంబెక్కి యంతకుంబోలె నరుదెంచి విభీషణుం గాంచి రోష మిట్లు ముడింప,

క. "పినతండ్రి వయ్యు నక్కట
కనికర మొకయింతలేక ❀ కడఁగి వధింపన్
బనిచెదవు మానవాధము
నను గెలువఁగ వశమె దేవ ❀ నాథునకైనన్.

క. పోఁడైన బంధువర్గము
పాండొల్లకయున్న తోడి ❀ పొత్తు విడిచి చే
రాదగని మనుజుఁజేరుట
నింద్యము నోడికట్టితీవు ❀ నీచచరిత్రా!"

అని పరుషోక్తులాడిన, విభీషణుండు,

చ. "పరులధనంబుఁగొంచుఁ బర
భామలఁ బట్టుచు విప్రులన్ మునీ
శ్వరుల వధించుచున్ ద్రిదశ
వర్గముతోడుత విగ్రహించుచున్
గరుణ యొకింతలేని దశ
కంఠుని చెయ్వులఁజేసి నా మనం
బెరియుచునుండ విప్ర ధర
ణీశ్వరు రాఘవు నాశ్రయించితిన్"

అని ప్రత్యుత్తరమిచ్చె. అంత నింద్రజిల్లక్ష్మణులకు భీకరసంగ్రామంబు ప్రవర్తిల్లె. ఇరువుర బాణవర్షంబులకు మితి లేదు. ఇరువుర హుంకారములకుఁ బారములేదు.

సీ. పెనుమంచు గవిసిన | మునిఁగి కానఁగరాని
భూధరంబులతోడి | పోల్కి గలిగి
మిగులదట్టములైన | మేఘమండలముల
నడిమిచంద్రార్కుల | బెడఁగుగలిగి
ప్రథితమహాయస | పంజరంబులలోని
వరమృగేంద్రంబుల | కరణిగలిగి
యొగిఁ బ్రమాదంబున | నోదంబులోఁజిక్కు
సామజంబులతోడి | సాటిగలిగి
దశరథాత్మజుండు | దశకంఠసూనుండు
మొగిఁ బరస్పరాస్త్ర | ములను జేసి
యతితిరోహితాంగు | లైతమస్సంఛన్న
పరపదార్థములనఁ | బఱపుదక్కి.

బాహాసారమును జాపనైపుణియును రుసన్నాహంబును విజయోత్సాహంబును మెఱయ నిరువురు సములై రవికిరణంబులకుఁ జోటీక పవనునకుఁ జోరవయీక శరవర్షంబుల మునుంగుచుఁ దేలుచు నుండిరి. హనుమ దంగద విభీషణ జాంబవదాదులు రక్కసులనుక్కడంచుచు నొక్క ప్రక్క నెక్కటెక్కటి పోరుచుండిరి. ఇంద్రజిత్తు నాగాస్త్రమేయ లక్ష్మణుండు గారుడాస్త్రమేసి దాని యురవడి నడంచె. రావణి కౌబేరంబుపరప దాశరథి యామ్యంబున దాని నడిచె. ఆగ్నేయంబు మేఘనా

దుండు పఱఁగింప రామానుజుండు వారుణాస్త్రంబున దాని
యుడుకుంజల్లార్చె. చలంబు బలంబుదీపింప దివ్యాస్త్రంబులఁ
బోరి దిక్కూలంకషధ్వానంబులఁ గావించుచు డస్సియు నుడు
గక కడిమిని వెడంద వాతియమ్ములేయుచు యుద్ధమాడియాడి
కడకు లక్ష్మణుండు విసిగి యైంద్రాస్త్రమ్మురివోసి యాకర్ణ
పూర్ణమ్ముగాఁ దిగిచి "రామచంద్రుండు సత్యరతుండేని సీత
పూతచరితయేని యేను వారిందవిలిన భక్తింగొలుతునేని
దైవంబు కృప నాకుఁ గలిగెనేని యీకార్యంబు విబుధహితం
బేని మూఁడులోకంబులు మోదింప నియ్యస్త్రరాజం బింద్రజి
త్కంఠంబు విలుంఠనమ్ము గావించుఁగాత" మని విడిచిన నది
నిర్ఘాత పాత సంఘాత భీతిదంబై ప్రచండ చండ కరశతావిర్భా
వంబై సుపర్ణోదీర్ణఘూర్ణంబై ప్రళయదహనదాహావహంబై మం
డుచుఁ జదలును దెసలును బుడమియుం బగులం బఱతెంచి
హేమచారుమణికుండలమండితమైన మేఘనాదు మస్తకంబును
గఱుక్కునఁ ద్రుంచె. సురగణంబులాడి పాడి కుసుమవృష్టిఁ
గురిసె. వానర నికర ప్రశంసలతో విజయలక్ష్మితో సామీరి
వి షణులతో లక్ష్మణుండు వచ్చి రక్తశోభిత గళత్స్వేదాను
విద్ధాంగుఁడై యన్న పదపద్మంబులకు నమస్కరించె. నిండారు
ప్రీతిని రాఘవుం డనుజుని గ్రుచ్చియెత్తి గాఢంబుగఁ గాఁగి
లించి యంకపీఠి నిడికొని ప్రమోద బాష్పపూరితనయనుం
వావరుల విలోకించి యిట్లనియె.

మ. "ఘనమాయుండగు నింద్రజిత్తు ననిలోఁ
గాలుండపోలెన్ వడిన్
దునిమెన్ లక్ష్మణుఁ డింక నే దశముఖుం
డోర్వీర్య మేపారఁగా
ననిలోఁ గూల్చెదఁ బేర్చి యీనడుమ దైః
త్యానీకముంబట్టి నె
ట్టనఁబోనీక వధింపుఁ డొక్కమొగిఁ గ
ట్టల్కం గపివ్రాతముల్!"

అట రావణుండు హత శేషుల వలన నింద్రజిన్మరణంబు విని మొదలు నఱికిన విటపివలె ఱెక్కలు తెగిననగంబువిధంబున నేలకు వ్రాలి చాలసేపటికిఁ దెలివొంది "హా జగదేకవీరా! హా లంకాపురపాలా! హా సమరార్ణవకర్ణధారా! హా లోకాంతకా! దేవేంద్రుం జయించి నరాధమునిచే నేల పాలైతివే? నీ ప్రతాప మేమయ్యె.? నీయలుకకు లోకంబు లాకులంబులగునే? అట్టి నీ పెంపు సొంపు తెంపు నిలింపులు నవ్వ నడఁగి పోయెనే? అక్కటా! నీ మాయలెల్ల మాయమయ్యెనే? ఇఁకనే నెవ్వనికని యీ ప్రాణంబుల భరింతు? నాకిఁక దిక్కెవ్వరు? ఈ శోకవారాశి నెట్లు తరింతు? నీవు లేక నాకీ లోక మేల?" యని పరి పరి విధములఁ బరితపించి మూర్ఛిల్లి లేచి యుగ్రుండై పుడమి వడకఁ బాదతాడనంబు గావించి,

క. "శిలలు సలిలములఁ దేలెను
జలమున నరుల సురవరులఁ జంపెదరు ప్లవం

గులు పను లొనరించెదరుఁ గు
టిలమయ్యెం గాలగతియుఁ జెప్పర మెవ్వర్

మున్నింద్రజిత్తు మాయాసీతం దునిమె. ఇప్పు డదియే నిజంబ కావించెద. దేనిచే మా కిన్ని యిక్కట్టులు వాటిల్లె నా పాటలగంధిని బరిమార్చి యీ పై నరవానరాథములఁ బ్రేతపురి కంపి నా పగ నీఁగికొనియెదఁ గాక" యని యట్టహాసంబు చేసి చంద్రహాస మంకించి ప్రదీప్తవహ్నికుండంబుల పగిదిఁ గ్రోధానిలజ్వాలా కీలంబులైన నేత్రంబుల నర్చిష్మంతంబులైన తైలబిందువుల చందంబున నశ్రుబిందువులు గురియ దశవదనంబులు జేగురింప రుద్రుని విధమున వృద్ధామాత్యుఁ డి యనుచితమని వెను జనుదేం నశోకవని కేతెంచె. బాలమృగిం బట్టవచ్చు బెబ్బులి వడువునఁ బుడమి గ్రుంగ నడచివచ్చు దశముఖుం గని జానకి శోకాతిరేకంబున "నక్కటా! వీఁడు కుమారవధజనితక్రోధావేశంబున ననుఁ జంపవచ్చుచున్నాఁడు. దైవమా! నాకీ రక్కసునిచేతఁ జావు మూడఁ జేసితే? నాకై నేను జింతింపఁ గాని నా కొఱకై రాఘవు లెన్ని పాటులు పడుచున్నారు?

చ. అనిలసుతుండు మున్ను విన
యంబున రామునిపాలికేను జ
య మనఁ గొనిపోదు రమ్మనిన
నాగతి రాఁ దగదంటి నప్పుడే

చనిన దశాస్యుచే విచటఁ
జాపక పుణ్యచరిత్రుఁడైన రా
ముని యెదపై వసించి కడు
మోదమొలర్ప సుఖింతునే కదా!"

అని విలపించుచుండ, సుపార్శ్వుండు దశకంధరుని కడ్డంబు వచ్చి, "రాక్షసేశ్వరా! బ్రహ్మవంశమునఁ బుట్టి శ్రుతు లభ్యసించి లోకోన్నతఖ్యాతిం గడించి పెద్దలు విన్నఁ బెగడునట్టి స్త్రీహత్య గొడంబడుదువేల? నీ పరాక్రమము రాఘవుల పైవారిమీఁదఁ జూపఁ జెల్లుఁగాని వారిమీఁదఁ జూపఁజెల్లునే? శాత్రవుల రూపఱఁజేసి సీతను వశంవదం జేసికొనుటమాని యిట్టిపనికిఁ గడంగితివేల?" యని చంద్రహాసంబు పుచ్చికొని యాతని మరలించె. సుపార్శ్వవారిత కోపుండై దశగ్రీవుండు గృహంబునకుం జని మరల నెప్పటి యట్ల కొలువుకూటంబునకుఁ జనుదెంచి "నా యెడఁ గడు భక్తియు ననురక్తియు సమయోచితయుక్తియుఁ గలుగు నో బలాధిపులార! మీ రెల్ల రొక్కమొగి సన్నద్ధులై కదలి వైరుల వధించిరండు. కానిచో వారి మేనుల నలియఁ బొడిచిరండు. ఎల్లి నేఁ జని బొలియించెద" నని యాజ్ఞాపింప దశాననుశాసనంబున లంకలోఁ గల మేటిమగ లెల్ల నొక్క మొత్తంబై చిరకాల సంరక్షితంబైన మూలబలంబును గలిసి వచ్చి కపులం బొదివిరి.

## —: ఐదవనాఁటి యుద్ధము :—

### (మూలబలము)

నేల యీనినట్లు లెక్కకు మిక్కిలిగా సముద్రము పొంగి వచ్చునట్లు తెరలివచ్చు రాక్షసబలంబుం గని యిది యెక్కడిబలంబని కపిబలంబు దిగులువడియె. హనుమదాది కపివీరులు తరులు గిరులు గొని వారిం దలపడిరి. విభీష ణునివలన మూలబలంబు తెఱం గెఱింగి రఘుకులగ్రామణి ధనుష్టంకారంబు గావించి కపుల వారించి తన వెనుకనుండి వేడుకచూడ నియమించి యొక్కండ నిలిచి చాపాభ్యాస ప్రౌఢిమంబు మెఱయ దోస్సారంబు గీలించి చూపఱు మెచ్చ నంపకోలవాన గురియించి దానవులకుఁ దెరువులు దప్పించి వారికిఁ దాఁ గానరాక చెల్లాచెదరు సేయుచు నొక్క శర మునఁ బెక్కండ్ర నుక్కడంచుచుఁ బెక్కుతూపుల నొక్కని స్రుక్కించుచు నొక్కొక్క సాయకంబునఁ బెక్కురగుదులు గ్రుచ్చుచుఁ గృషికుఁడు క్షేత్రంబుగావింపఁ దఱచు టడవి నఱికినట్టులు నఱికి పడుగు పేకగాఁ బడవైచి సమ్మోహ నాస్త్రంబు ప్రయోగించిన నది యొకటి పదియై పది నూరై వేలై లక్షలై లెక్కకు మీఱి యొక్కొక్క రక్కసున కొక్కొ టియై రామరూపంబునఁ దోతెంచి విభ్రాంతి గలిగింప,

చ. ఇదె రఘుపుంగవుం డెదిరె

నెక్కడికిం జనవచ్చు నింక న

ల్లదె రఘునాథు బాణతతి
యక్కడివాఁ డెటకేగెనొక్కొ వాఁ
డిదె యదె వచ్చెఁ బోయె మఱి
యెప్పటి ముందఱ నున్నవాఁడు వే
చదుపఁగఁజొచ్చెనంచు దను
జ ప్రవరుల్ గలయంగఁ బాఱుచున్.

ఇదిగో వీఁడే రాముఁడు. అదిగో వాఁడే రాముఁడు. పట్టుఁడు. కట్టుఁడు. పొడువుఁడు. చదుపుఁడు. చంపుఁడు. అని యొకరి నొకరు కొట్టుకొని మూలముట్టుగ నశించిరి.

పతుల సుతుల మనుమల హితులఁ జుట్టలఁ దలపోసి లంకలోని స్త్రీలెల్ల గుములై "అక్కటా! కిండకావర మెత్తి చుప్పనాతి సుకుమారు సుజనస్తుత్యు రాముం గామింపనేల? లక్ష్మణుం డామె ముక్కు సెవులఁ గోయ నది విని దానికై ఖరాదు లంత మొందనేల? ఈ దుర్మార్గుండు దశవదనుండు లోకమాతను సీతను దొంగిలింపనేల? అద్దేవి లంకలో నడు గిడినప్పటినుండి యిన్ని దుర్నిమిత్తములు పుట్టనేల? రావణు నికై మనవా రందఱు రామునిచేఁ జావనేల? ఆ ముక్కిఁడి రక్కసిచే నింత యాపదలయ్యె. ఏమిసేయుదము. దిక్కేది?" యని పలువిధములఁ బ్రలాపించి రావణుం దిట్టుచుండిరి. స్వసైన్యనాశమునకుఁ బురస్త్రీల శాపాలాపములకు నిశాచ రేశుండు కటకటపడి విరూపాక్షోనత్త సుపార్శ్వుల యుద్ధ

సన్నద్ధుల గండవిన వారలు ధీరులై నానావిధసాధనంబులు ధరించి భయంకరాకారులై రావణుం గలిసిరి. అతండును సంసిద్ధుండై మనవారిం జంపిన పగ యెల్ల నేడు తీర్చెదనని ప్రగల్భంబు లాడుచుఁ బయనించె. నిశాచర బలంబుఁ గని శాఖాచరవాహిని తెరలివచ్చి కలియఁబడియె. కొంతసేపు దైత్యులకు జయంబును గొంతవడి కపులకు జయంబును గలిగించుచు జయలక్ష్మి చంచలయై వర్తించుచుండెను. ఇరుదెగలఁ బీనుఁగుల రాసులు గుట్టలుగాఁ బడియె. పునుకల తునుకలుఁ బ్రేవుల ప్రోవులు నెమ్ముల యుమ్ములుఁ బీనుంగులైన యేనుఁగులుఁ జిఱ్ఱునఁ దిరిగి సురుగు గుఱ్ఱములును మనోరథంబులతోన భగ్నమగు రథంబులును లెక్కకుమిగిలె. రాక్షసుల చేయి మిగిలె. వారి హుంకారంబులు ప్రబలె. వనాటుల దీనాననంబులు పొడసూపె. అది గని సహింపక కుంభకాంతకుండు విజృంభించి విరూపాక్షుం దలపడి మల్లయుద్ధంబుసేసి వారు వీరచ్చెరువొంద వాని ప్రేటుల కోర్చి పొంచి పొం చెలంగి పిడికిటిపోటునఁ గాలుని కాణాచి కనిపి యున్మత్తు నరదంబు గ్రుంగ వానిపైకి లంఘించి వాని విల్లు విఱిచి వాని కరవాలంబున వాని శిరంబు నఱికె పాఱవైచి రక్షసులం దఱిమి భానుసూనుండు చండభానునియనువున విక్రమించిన నతని యాటోపంబునకు సైరింపక మహోదర మహాపార్శ్వులు తమ యరదంబుల దఱిమి సునిశితసాయ

కంబులుపరపి సుగ్రీవుని నొప్పించిరి. అతండు సంగరవ్యాపార దుర్నిరీక్ష్యవిభవుండై దోర్వీర్యంబు నెఱయ మహోదరుతేరికి లంఘించి వాని మెడఁ బట్టికొని మహాపార్శ్వుని స్యందనంబున కుఱికి మఱొకచేత వాని కంఠంబుఁ బట్టికొని యిరువుర నెత్తి యొకరి కొకరి నుదుకుచుఁ "బోండు మీ పేరివారు మీ యన్నకొడుకులు ప్రేతలోకమున నెదురుచూచుచున్నారు. వారిం జేరుఁ" డని చిత్రవధం బొనరించె. అది గని రోష వివశోగ్రప్రమత్తుండై ప్రమత్తుం డురవడి గదగొని సుగ్రీవుని మీఁది కేతేర నంగదుం డడ్డుపడి నేర్పుమెఱయ వాని గద నంకించుకొని వాని మొగంబు రొట్టెయువలె నడంగి మడంగఁ గొట్టె. వాఁడా ప్రేటుతో మహోదరు మహాపార్శ్వులఁ గలిసికొనె. తనవారి పాటుఁ గని రావణుం డంత కాకారుండై పేర్చి కపికులంబులఁ గొందఱ నూరుల భేదించి కొందఱ జానువులఁ బగిల్చి కొందఱఁ గటిప్రదేశంబుల నొగిల్చి యుదరంబులఁ గలంచి యురంబులగలించి బాహుల స్రుక్కించి చరణంబుల మ్రక్కించి కంఠంబులఁ జఱచి శిరంబుల నెత్తురు జొత్తిల్ల మొత్తి సోల్చి వ్రాల్చి కేరి మీఱి తఱుమఁజొచ్చిన నందఱు విఱిగి పాఱి రఘువరు నాశ్రయించిరి. అమ్మహాత్ముండు గుణధ్వని గావించుచు రావణున కభిముఖుండై వాని శరవర్షమున ముంచె.

—:రామ రావణ ద్వితీయయుద్ధము:—

ఇరువుర శరావలు లంబరంబుగప్పి చీఁకటి గావించె. కొంతవడి దివ్యాస్త్రంబులఁ బరస్పర ప్రయోగ విధ్వంసనములఁ దేజరిల్లి పోరుచుండ లక్ష్మణుం డతిక్రమించి సప్తార్చులం బోలిన సప్తసాయకంబుల నిగిడించి కేతుదండంబును సప్తఖండమ్ములుచేసి సారథి శిరంబు డొల్లనేసి పంచవిశిఖంబులఁ గరికరోపమమైన రావణు చాపంబు ముష్టికిం దెగ వ్రేసె. అంతలో వైరిభీషణుండు విభీషణుండు కాలదండసదృశంబైన గదాదండంబు బాహుదండంబులం బట్టి మిడుంగుఱులు సెదర జిఱజిఱం ద్రిప్పుచు దశకంధరు రథాశ్వంబులం బిలుకుమార్చె. దశముఖుండు హతరథుండై రయంబున ధరణికిదాఁటి యొక శక్తిం గొని విభీషణువైవ దాని నడుమన ముత్తునియలుగా లక్ష్మణుండు ఖండించె. తీఱని కోపంబున రావణుండు విభీషణుం జంపం దివిరి మయదత్తయు నప్రతిహతయు దురాసదయుఁ బరిపంథిఘాతినియు నగు శక్తింగొని వేయఁబోవ జీవితసంశయంబున దిక్కులు సూచు విభీషణుని వెనుకకుఁ దిగిచి శరణాగతత్రాణుండగు లక్ష్మణుండు ముందు నిలిచి వివిధాయుధంబులు పరఁగించె. రావణుండు,

చ. "జడతవహించి రాజసుత!

చావఁగఁ జూడకు మా విభీషణున్

విడువుము పీడ కిప్పగిది
వీర్యముఁ జూపితివేని మండుచుం
గడువడి మత్త్రాగ్రమునఁ
గ్రాలెడు నిష్మ్రహానీయశక్తి బ
ల్వడి భవదీయవక్షముఁ గ
లంచి వధించి చనున్నిజంబుగన్"

అని పలికి తోలఁగని లక్ష్మణుపై శక్తిం బ్రయోగించె. 'ఈ మహానియశక్తివలన లక్ష్మణునకుఁ బ్రాణహాని కలుగకుండుఁగాత' మని శ్రీరాముఁడు నిర్మలాంతఃకరణంబునఁ బలుకుచుండ నది భీమవేగంబున నేతెంచి లక్ష్మణు నురంబు గాఁడిన నతండు శక్తినిర్భిన్నహృదయుండై తూలి రణమేదినిం బడియె. అతని యవస్థం గని భ్రాతృవాత్సల్యంబున బాష్పకణంబులు గ్రమ్మ దేఁబ విషణ్ణహృదయుండై త్రుటిమాత్రంబు మౌనంబూని కరకావర్షంబు నద్రియోర్చుగతి రావణు తీవ్రశరంబులోర్చి విషాదకాలంబు గాదని చింతించి బహుప్రయత్నంబున దశముఖుని నిశ్చేష్టితుం గావించి లక్ష్మణుకడకుం జని యతని హృదయంబు ఛేదించికొని పుడమింగాఁడిన శక్తిం బెఱుక సమర్థులు గాకున్న వానరుల వారించి యవలీల నాశక్తిం బెఱికి విఱిచివైచి లక్ష్మణుం గాచికొనుఁడని వారల నియోగించి యుగాంతాగ్నిచందంబున మండుచు భీషణభాషణంబుల నిట్లనియె.

క. "నీచాత్ముఁడైన యీ రజ
నీచరుతో నాదు యుద్ధ నిపుణత వేడ్కం
జూచుచునుండుఁడు విస్మయ
గోచరులై మీరలెలమిఁ గుతుకితమతులై.

సీ. వనరుహబాంధవ వంశమ్మునందు నే
జననంబునొందుట చనునయేని
ధర్మలోలుండైన దశరథేశ్వరునకు
నాత్మసంభూతుండ నైతినేని
యనిలోన నేపున నాదశకంఠుండు
నెఱి దప్పి పాఱక నిలిచెనేని
తగవును సత్యంబుఁ దగుభంగి నేప్రొద్దు
వదలని ప్రీతిఁ జల్పుదునయేని
రాముఁ డొండెను భువిలోన రావణుండు
నొండె నింతియ యిరువురు నుండుటెట్లు
గలుగనేర్చును గావునఁ గడఁగి వీని
నేపుమాపెదఁ దూపుల ప్రేపులెగయ"

అని రోషనివశోగ్రాకారుఁడై రాఘవుండు వింటినేర్పును దోస్సారంబు నొక్కరూపుచేసి పుంఖానుపుంఖంబులుగా క్షణ మాత్ర నక్షణదాటాధీశ్వరునిపైఁ బరపిన నతి కఠోరంబులగు రామబాణపాతంబుల జర్జరీభూత సర్వావయవుండై నివ్వా చుచుఁ గచభారంబువీడఁ బరిధానాంచలంబు కేతన పటా

కారం బమరింప ధరణి గంపింప నసహ్యావిక్రముండైన సింహం
బుం బొడగాంచి పఱచు కుంజరంబుమాడ్కి నసురులు బెదరc
గపులార్వc గాందిశీకుండై లంక సొచ్చి యంతిపురికేగి
నొచ్చిన యంగంబులు సవరించికొని కొండొకసేపు సేదదీర్చి
కొని లజ్జాభయవిషాదంబులు మొగంబునc దోcప నేమియుc
దోcపక మందోదరి రావించి యద్దేవితోc బెద్దయుం బ్రొద్దు
చింతించి యిట్లనియె.

"దేవీ! నేcటి యుద్ధంబు తీరేమందు? రాముcడు లయ
కాలభీముండై చాపాభ్యసన చతురత్వోర్జితుండై ప్రత్యాలీఢ
పాదస్థుcడై విలయకాలాభ్రవృష్టింబోలె సాయకవృష్టిం గురి
యించి మత్సర్వావయవంబులc గాcడనేసి నొప్పించె. దిక్పా
లకుల జయించిన నేను నేcడొక నరునికోడి పాఱివచ్చితి.
జగములనెక్కటి మ్రింగcజాలు కుంభకర్ణుని దిక్పాలకహృచ్ఛూ
లమైన శక్రజిత్తుని నీతిసారజ్ఞ విఖ్యాతు నతికాయుని నఖిల
రణముల నాcటితీరిన రక్షోవీరుల నరవానరాధముల పాల్పc
బెట్టితి.

చ. నయవిదుcడా విభీషణుcడు
నాcడటు నీతి యెఱుంగcబల్కె దు
ర్నయమున నేను గైకొనక
గ్రక్కునc ద్రోల్చెడలంగcబుచ్చితిన్

నియతమనస్కుఁ డాతఁ డొఁగి
నేర్పునఁ జెప్పినమాటలన్ని త
ద్దయు నిజమయ్యె నేఁడు వని
తా! యిపు డేమన నేమికాఁదగున్?

అనలునికంటె వేఁడిమియై వజ్రముకంటె వాఁడిమియై మారుతంబుకంటె వేగమై కాలదండముకంటె నమోఘమై కాలసర్పముకంటె భయదమై పిడుగులకంటె బెడిదమై వచ్చు రాము భీమాస్త్రసందోహంబు నోర్చువాఁడు ముజ్జగంబుల లేఁడు. వాసంగినఁ గాలుండను సంశయంబుగలుగు. దివియందు భువియందు జలధులందు దశదిశలఁ దురగముల మీఁదఁ గుంజరములపై రథములందుఁ బూర్ణములై యవిరళగతి రామనామకంబులు నిండినట్లు దోఁచె. కను మూసినను విచ్చినను సర్వకాల సర్వావస్థలయందు రామమయమై ప్రపంచము తోఁచుచున్నది. నా కింక వేఱు శరణంబు లేదు. తొల్లి నా సంగీతంబునకు మెచ్చి గంగాధరుండు వరమిచ్చినచొప్పున నతని నారాధించి హోమంబు సేయుదు” నని సున్నాతుండై శుచియై పరమేశ్వరాలయంబున కరిగి రాక్షసులఁ గాపువెట్టి వేల్మిగావింప సమకట్టెనఁ దలోదరి యగు మందోదరి యచ్చటికేతెంచి “మునివృత్తిం దాల్చి యిట్లుండ నీకు మున్నోడిన వేల్పు లిప్పుడు నగరె? ఇది వీర ధర్మమే? ఇంత భయముగల్గియుండిన సీత నేల తెచ్చితివి?

ఇప్పుడేని యీ వృత్తి నీ కిష్టమేని సీతను రామున కొప్పించి యడవులకు నడుపుము. నేనును వచ్చెద. విభీషణుఁడు లంక యేలును. కాదేని బలయుతుండవై యీలంబొసర్చు" మనిన లజ్జించి హోమకృత్యంబులు వర్జించి యతం డభ్యంతర మందిరంబునకుఁ జనియె.

నాఁటిరాత్రి నడురేయి రావణశక్తి నాటి భూపతితుఁడైన లక్ష్మణు నవలోకించి రాముండు శోకపరీతచిత్తుండై "నాయనా! లక్ష్మణా! అడవుల నెల్ల నను గాచి యిపు డిట్లు దిగవిడువఁ జెల్లునయ్య! నిన్నుఁ గోలుపోయిన పిదప నాకు సీతయేల? భూతలమేల? జీవిత మేల? ఈ సంగ్రామమేల?

చ. అడవికి వచ్చు నాఁడు నయ
మారఁగ నీ దగ నప్పగించె నా
కడలుచు నేను నట్లు యగు
నంటి నయోధ్యకు నింక నేగఁ ద
ల్లడమున నిన్నుఁ గానకొగి
లక్ష్మణుఁ డేడనుచుఁ సుమిత్ర న
న్నడిగిన నేమిచెప్పుదు ద
శాననుచే ననిఁ గూలె నందునే?

క. ఎలనాగలుఁ జుట్టంబులుఁ
గలుగుదు రెచ్చోటనయినఁ గరమరుదారఁ

దలఁప సహోదరు నెలమిం
గలుగఁగ నెచ్చోటఁ బడయఁ గాఁ దరమగునే?"

అని నెవ్వగలం బొగులుచుండ సుషేణుండు సమీపించి "దేవా! మీరు ప్రాకృతులఁబోలి శోకింపఁదగునే? సర్వకార్య వినాశకరమైన యీ దుఃఖంబు విడువుఁడు. లక్ష్మణుని మేనఁ బ్రాణంబులున్నవి. నేత్రంబులు ముఖంబు హృదయంబు పరికించిన వీతాసుత్వంబు లేదు" అని హనుమంతుని వంకఁ దిరిగి "మహాత్మా! మున్ను నీవు తెచ్చిన యోషధిశైలంబు సూర్యోదయంబునకు మున్న కొనిరావలయు. ఈకార్యంబు నీకుఁ దక్క నితరులకు దుష్కరంబు. తడవైనఁ గార్యంబు దప్పు" నన రాముఁ డతనిం గని,

క. సోదరులమేము నలువుర
మైనను తోడగుదు వీవు ననయముఁ జేతో
మోదంబు మిగులఁ గలుగఁగ
నాదెసఁ గృపసేయవయ్య నగచరవర్యా!

అన నతం డట్లగాక యని రామునకుఁ బ్రణామం బాచరించి యతని దీవన లంది యాకసంబున కెగసి యుత్తరదిక్కుం గూర్చి పోవుచుండెను.

—:కాలనేమి:—

చారుల వలన దశగ్రీవుం డది విని పరుగున మారీచపుత్త్రుండగు కాలనేమి గృహంబునకుం జని వాని సపర్యల

వారించి "సంజీవనిఁ దేఁబోవు నాంజనేయు నడ్డుపఱుపు" మన నతం డులికిపడి "నా బ్రతుకు నీ కొల్లదే? నా తండ్రిగతి నాకుం బట్టవలయు నే?" యన రావణుం డిట్లనియె. "నీవు మాయావి గావున మునివేషివై ద్రోణగిరిచెంత దేవనిర్మితం బైన యగాధసరోవరంబున హనుమ దిగునట్లు యుక్తిపన్నితి వేని యందుఁగల మహాగ్రాహంబు నోటఁజిక్కి యతఁ డంతరించు. అంత రాముకార్యంబు దీఱు. నాకు జయంబు చేకుఱు. నన్నుఁ గాదందువేని నిన్నుఁ దెగవ్రేయుట నిక్కువం" బనఁ గాలనేమి భయంబుగొని నీ పనిచినట్లు కావించెద నని మనోజవంబునఁ బఱచి దశాననోపదిష్ట ప్రదేశంబునఁ దన మాయ నొక యాశ్రమంబు గల్పించికొని కృతకమునియై మిథ్యాజపంబు సేయుచుండె. హనుమంతుండు ద్రోణాద్రి కేగుచు నచ్చటి మాయాముని యాశ్రమంబుంగాంచి "మున్ను త్రోవ వచ్చునప్పు డియ్యాశ్రమంబు పొడకట్టదు. దారి తప్పితినా యేమి?" యని సంశయించి "యిందున్న మునిం గని మార్గమడిగి మఱి పోద" మని నిశ్చయించి యటదిగి యమ్మౌనికిం జాఁగి నమస్కరింప నతండు కనువిచ్చి "హనుమా! రామకార్యార్థివై సంజీవనిం దేర ద్రోణాచలంబున కేగుచుంటివా? దారితప్పితివి. రామసాహాయ్యంబు మాకు నవశ్యానుష్ఠేయంబు. నీ విధంబు దివ్యదృష్టిం గ్రహించితి. నీవీ సమీపమున నున్న కొలనికిఁ బోయి శుచివై వార్చిరము

మంతుం డతనిఁ గలయఁజూచి సుగ్రీవుండు కాదని నిశ్చయించి
యాగ్రహానిగ్రహవ్యగ్రుండై పెలుచ శిరంబు దాఁచిన వాఁడు
బెట్టుమార్చిల్లి తేజి నిజరూపంబు దాల్చి నిశితకాండంబు లేయ
మరుత్సూనుండు లాంగూల లీలాచాలనంబున సాయకావళుల
విరియఁదట్టుచు వానిం బట్టికొని క్రిందఁ ద్రోచి మొగము పగుల
వ్రేసి మోఁకాళ్ల మోఁది యెత్తి పుడమిపై వైచి వక్షంబుఁ బగుల
నడిచి సామజరాజు తామరసనాళంబునట్లు వాని కంఠనాళంబు
ద్రెంచి వధించి విజయలక్ష్మీవిరాజమానుండై ద్రోణశిఖరికిం జని
మునుపటి యట్టి సత్కార్యపథము లంతర్హితంబులైనం గోపించి
వాతూలసుతుం డప్పర్వతంబుఁ బెఱికి యెత్తియార్చుచు మింటి
కెగయ ద్రోణాచల పాలకులగు చిత్రసేనప్రభృతి గంధర్వులు
పదుమూఁడుకోట్లు చుట్టుముట్టి నాఁటిదొంగ నేఁడు దొరికె
నని వీనిం గృతాంతగోచరుం జేయుదమని హనుమంతు నద
లించి వివిధసాధనంబుల నొప్పింపఁ గడంగిన నతండు రేఁగి
యంఘ్రులఁ దన్ని నఖంబుల వ్రచ్చి పెడకేలఁ దాఁచి పిడికిళ్లఁ
బొడిచి మోఁచేతులమోఁది నోటఁగఱచి వాలంబున గుదు
లుగాఁ గట్టి చదియఁగొట్టి పారావారంబునఁ బాఱవైచి కడ
కాళ్లుపట్టి గిరగిరఁ ద్రిప్పి యొకనితో నొకని వ్రేసి వీరవిహారంబు
సలిపిన వారు నొచ్చి విచ్చి వెఱచి పఱచిరి. కొందఱు విభ్రాం
తులై నిలిచి "నాయనా! మా జోలికి రాకుము. కొండం గొని
పొమ్ము. ఇట్టియుపక్రమ మేరికిఁ దగరము? నీకు శుభమగుత" మనిరి.

అటనుండి కదలి హనుమంతుం డంతరిక్షంబున వచ్చుచు నయోధ్యాపురీప్రాకారంబులపైఁ బోయి నందిగ్రామము మీఁదుగా వచ్చి యచ్చట నాఁటిరాత్రి దుస్స్వప్నంబు గని భరతుండు రామలక్ష్మణ శుభార్థంబు విప్రులచే హోమాదికంబులు గావించుచుండ నతనిఁ గాంచి రాముండని భ్రమించి రాక్షస మాయ గాఁబోలు నని శంకించి యేమైననేమి? మనమీఁదికి వచ్చినఁ జూచికొందమని యూహించి యటనుండి తీవ్రవ గరుడానిలవేగుండై వచ్చుచుండె.

పోయిన కాలనేమి మరలరామికి రావణుండు శంకించి మాల్యవదాదులఁ బెక్కుఱు రక్కసుల ననుము నడ్డగింపఁ బంపె. వారును వివిధాయుధధారులై దక్షిణసముద్రంబు మీఁదుగా వచ్చు హనుమంతుదాఁకి యడ్డగించిరి. మారుతి మొదట వారిని విద్యుల్లతావేల్లితంబులును విజృంభితదంభోళి సంరంభములు నూర్జితగర్జితంబులు నగు జీమూతంబులుగా శంకించి పిదపఁ బడి భీషణ వివిధాస్త్రసింహనాదంబుల నక్తంచరులుగా నెఱింగి రౌద్రమూర్తియై పరశుప్రాసాంకుశ ముసల క్షురార కరవాల శక్తి గదా తోమర చక్ర కుంత నారాచంబుల నిర్లక్ష్యంబు చేసి యాయుధవృష్టిం గేసరకిశోరంబు దూఱి సర్పంబుల దర్పంబడంచు సుపర్ణుభంగి నసురుల వాలంబునఁ జుట్టి పట్టి త్రిప్పి వారాశిం బడవైచి ద్రోణగిరిం బడనీక వామహస్తంబున నెత్తిపట్టికొని పార్ష్ణిఘాతంబుల బడలుపఱచి చరణంబుల

మరణంబునొందించి పాదాగ్రంబులందట్టి జానుఘాతంబులఁ బ్రేతంబులంజేసి పార్శ్వప్రహారంబుల సంహారంబు గావించి కక్షంబుల మోఁకాలిమడిమలఁ గంఠమ్ము లిఱికించి త్రుటనమ్మెనచ్చి నిరవశేషమ్ముగా రాక్షసవినాశమ్ముగావించి మించి వచ్చిన మాల్యవంతు నత్తికొగిరి యొక్కత్రొక్కు ద్రొక్కిన, వాఁడా త్రొక్కునఁ గుదిసి కడలంబడి పాతాళంబున కేగె. గెలుపొంద గాలిచూలి మింట నేతెంచుచుండె. మహౌషధ భూధరకాంతింగాంచి భూకాంతుండు పద్మినీకాంతుని యుదయంబుగా సంశయించి తమ్మునింగని చింతాక్రాంతుండై,

క. "రూపింప నెల్ల వారికి
నేపారఁగఁ బ్రొద్దువాడువ నీసమయమునన్
నాపాలఁ బ్రొద్దుగ్రుంకెను
బాపపు దుఃఖాబ్ధిలోనఁ బడఁబాలైతిన్.

ఇఁకనీతోడిద నాగతి. అన్నందిగనాడి నన్ను శరణన్న వి షణునకు లంకంబట్టంబుగట్టితి. అదియుఁ దప్పె" నని గద్గదితస్వరంబునఁ బరితపింప, మారుతి సమీపించు కొలఁది నెల్లర కావంక దుర్నిరీక్ష్యంబయ్యె. కపులు హాహారవంబుల దురపిల్లిరి. లోకైకవీరుండు విలయకాలశూలి నాఁ గంటి మంటలు మింటఁ బర్వ మంబుగా రోమకూపంబుల విస్ఫులింగములు నింగికెగయ బ్రహ్మాండభాండంబు భగ్నంబుసేయ నప్పళించు తలం పుప్పతిల్ల నుద్ధతవేగుఁడై "హనుమ రాకమున్న లక్ష్మ

ణుండు లేనకమున్న మన్మనోరథ సిద్ధి గాక మున్న యన్వ
యంబున కాదిపూరుషుండై జగద్బంధుండైన కమలబంధుండు
పగలఁగలిసి యుచితానుచితమేది యుదయించు చున్నాఁడు.
ఇతని నాతూపుల నేపుమాపి కూల్చి జగతి నరాత్రసముగఁ
జేయుదుఁ గాక" యని యాస్ఫోటించి పరాక్రమించి వీర
రౌద్రరస సంరంభంబునం బొల్చి చాపంబు కరంబునఁదాల్చి
భాస్కరు నేయఁదలంచు తఱి జాంబవత్సుగ్రీవ విభీషణాదులు
సంభ్రమంబునఁ బఱతెంచి వినయ వినమితశిరస్కులై ఫాల
భాగరచిత కరసంపుటులై "పుణ్యపురుషా! భువనత్రయం
బాకని కై చెఱుపఁజూడకుము. నీ వస్త్రమందిన రీతింగాంచి
లోకంబు లాకులత్వమందె. ఉపసంహారింపుము. దివ్యౌష
ధులఁ గొనివచ్చు హనుమంతుని ప్రభగాని యది సూర్య
ప్రభ గా" దని ప్రార్థించిన రామచంద్రుండు శాంతము • రియై
కుతూహలియై పావని కెదురుగ వలీముఖులఁ బంపె.

భూమికి దిగివచ్చు భానునిపోలె హనూమంతుండు
ద్రోణాద్రితో వనచరమధ్యంబున దిగి పర్వతంబుడించి శ్రీరా
మునకు వలగొని నమస్కరించి నిలిచి "దేవా! వడుమఁ
బెక్కు విఘ్నంబులు వాటిల్లుటం జేసి యింత మసలవలసె.
నా తప్పుల మన్నింపుము. ఇంతకు సూర్యోదయంబు గాలేదు
గదా! అయిన నేమి?

ఉ. తమ్ములవైరిఁ బిల్చి యుమ్మ
తమ్మును దమ్మున కీయఁజాలనే?
క్రమ్మి దివసమ్మునం దమృత
కుంభము దెచ్చి యొసంగఁజాలనే?
యిమ్ముగఁ బాలవెల్లి మథి
యించి సుధంగొని తేకపోదునే?
బమ్మను బట్టితెచ్చి తన
ప్రాఁతను మార్పఁగఁజేయనే? వెనక!"

అని ధీరతమెయి నాడిన మారుతి నొడువులకుఁ బరితుష్టాంతరంగుఁడై రఘుపుంగవుం డతని గాఢమ్ముగఁ బరిరంభించి యభినుతించుచు,

తే. గీ. "నీకుఁ దప్పఁగలవయ్య? నే నితతమున
దినకరాన్వయ మరయఁ బ్ర త్త్వనొందె
నన్నుఁ గాచితి వనుజ ప్రా ణముల నిచ్చి
తీరక నీ ఋణ మెన్నఁడే నెట్లు దీర్తు?"

అని ప్రశంసించె. అంత సుగ్రీవు ననుమతిని సుషేణుండు ద్రోణశిఖరి నెక్కి మహౌషధులం గొనితెచ్చి భేషజతంత్రంబు నెఱప సుప్తోత్థితుని క్రియ సముజ్జీవితుఁడై లక్ష్మణుండు లేచె. తొల్లింటి యట్లోషధిశైలము నుంచిరమ్మని పావనికి జానకీజాని యానతీయఁ జిత్తంబని యంగీకరించి రామస్తుతివాక్యజనిత మహోత్సాహ ప్రవర్ధమానానూన శరీ

రుండై కరంబునఁ దచ్ఛిఖరిరాజంబును ధరించి యురవడి
నంబరతలంబున నరుగునపుడు వేగులవలన నీ యుదంతంబు
విని రావణుండు స్థూలజంఘ మహానాద మహాదంష్ట్ర మహో
రస్కోల్కాముఖ మహావీర్య చతుర్వక్త్ర శంఖకర్ణ హస్తికర్ణ
మేఘవర్ణ చిత్రాద్రి ప్రభృతులఁ బెక్కండ్ర రక్కసజోదుల
నియోగించి "మీరు చని పావనింబట్టుకొని యప్పర్వతంబు
వనధింబడవైవుఁడు. కాదేని వానింజంపి యొండె రావలయు.
ఇకార్యసాధకునకు నా రాజ్యమం దర్ధంబొసంగుదు" నని
పంచిన వారనేక వరూధినీ సహస్రంబులతోఁ గదలి యహాం
కార హుంకారంబు లులియు నార్చుచుఁ బలుపాశమ్ముల
శైలంబుం బొదువుపగిది మరుత్తనయుం బొదివిన వారింగని
"మీరు ప్రాణంబులొల్లరా యేమి?" యని నవి పావమాని
వాసుకి కరంబై యైరావతకరోపమంబై దర్పిత దానవ గర్వ
దారణదారుణోల్లాసమును ధూమకేతనవిలాసమును నిత సము
ల్లసజ్జియ వాసమును నుపమితశూలి శూలమును నగు తన
వాలమును బెంచిన నది,

సీ. శూలిఫాలానలా ఽ లమై మండుచు
నురవడిఁ గొండలఁ ఽ నొగి దహించి
కాలదండాతిక ఽ రాళమై యలరుచుఁ
గ్రూరతఁ గొండలఁ ఽ బారిసమరి

హాలాహలచ్ఛటో ౹ త్త్రాలమై పెరుఁగుచు
నేపునఁ గొండఱ ౹ రూపుమాపి
వ్యాళోగ్ర మృత్యుపా ౹ శానార్యమై చేరి
పాలవక కొందఱఁ ౹ జుట్టితాఁచి
కఠిన నిర్ఘాత సంఘాత ౹ ఘాతజాత
వేదనాపాదనానూన ౹ విదితమగుచుఁ
జక్రిచక్ర క్రమక్రియా ౹ వక్రగతుల
వాయునందను వాలంబు ౹ వాలెనిట్లు.

మిగిలినవారిని జూడిని పదకరతాడనమ్ముల నఖర విదారణముల ముష్టికూర్పరఘాతమ్ములఁ బ్రేతపురికనిచి విజయశ్రీవిభాసితుఁడై విష్ణుపదవీధినిజని ద్రోణంబుచు బ్రాక్తనస్థానంబున నిల్పి యమానుష సత్త్వసంపన్నుఁడగు మరున్నందనుండు మానసవేగుండై మరలి మనుజనాథుని పదకమలంబుల బంభరంబుభంగివ్రాలె. అంతఁ బ్రొద్దువొడిచిన,

చ. కమలములొప్పె వానర ని
కాయ ముఖాంబుజరాజితోన యు
క్కుముదగణంబు వెంపఱిగె
ఘోరనిశాట మనంబుతోన ఘూ
కముల ముదంబుమాలె దశ
కంఠ సముద్ధతితోన చక్రవా

కము లనురాగ మొందె నధి
కంబుగ రాము సముద్యమంబుతోన్.

లక్ష్మణసంప్రేరితుఁడై శ్రీరాముఁడు రావణ సంహారణ కరణ బద్ధకంకణుఁ డయ్యెను. రామ లక్ష్మణుల సమరోత్సాహంబు గని వనేచరులు వెల్లుబ్బి సింహగర్జనములు గావించిరి. అది విని రావణుండు వెరవేది కరగలి దనుజరాజ్య చక్రుండగు శుక్రుని జేరనరిగి చాఁగిలిలేచి దశనిటల తటసంఘటిత దశకర పుటుండై గద్గదికంబున "నాచార్యా! భానుకులులు భానుసూనునితో లంకనుముట్టడించిరి. చిచ్చునఁ జొచ్చిన మిడుతల వలె నక్తంచరవీరులెల్ల నరవానరులచే హతులైరి. దక్షతుల జయించిన నేనిప్పుడు దిక్కేదినవాఁడనైతి" నని పరిదేవనంబు సేయ నిశాచరకులాచార్యుండు ప్రియశిష్యుం గని "వత్సా! నా చెప్పినచొప్పునఁ దప్పక హోమంబు గావింతువేని యందు దివ్యఖడ్గ శరచాప రథాశ్వములును నక్షయతూణీరంబును గవచకుండలంబులుఁ బ్రభవించు. వానింగొని యనికిఁగడఁగిన దుర్జయుండవై వైరుల ధృతిదూలించి వధింపఁగలవు" అని కార్యవిధానంబును మంత్రంబు నుపదేశించిన దశవదనుండు మోదమున నతనివీడ్కొని నగరవరణ దుర్గకవాటంబులు జత నముసేసి దనుజబృందమ్ముల నిమ్మలనుండ నియమించి విద్యుజ్జిహ్వుని నిర్విఘ్నతాకాంక్ష నంగరక్షకునిగా నియోగించి పాతాళంబుంబోని యొక మహాగుహాగర్భంబు సొచ్చి నలయు

వస్తువుల సేకరించికొని విధివిధానంబున హోమవిధిం బ్రా రంభించె.

—:రావణ హోమ విధ్వంసము:—

అవ్విధంబు విభీషణుండు గుర్తించి రామునకుం దెలిపి వానరానీకంబును దద్ధోమవిధ్వంసనార్థమై పంపఁ బురికొల్పె. రాఘవు నానతిని వానరులు లంకలోని కరిగి కనఁబడిన వారి నెల్లహింసించుచు శరణన్న వారిరావణుంజూపుఁడని నిర్బంధించి నిర్భర్త్సించుచు నల్లకల్లోలంబు గావింపఁ బలిహిత చరితమైన నరమ యంగదునకుఁ గరసంజ్ఞల దైత్యనాథుండు యజించు గహ్వరంబుసూపె. సమదసంరంభరోషంబులు మూప్పిరిగొన నంగదుండు వానరులరండని చేఁబిలిచుచు గుహాద్వారంబు చేరి ద్వారబంధనమగు ఘనగ్రావంబు నుగ్గుగాఁ దన్ని విద్యు జ్జిహ్వుఁ జదియఁబొడిచి వానినాలుకఁ బీఁకివైచి లోపలికేగి యట యజించుచున్న

ఉ. రావణుఁ గాంచెనం దురుత
 ర స్ఫుటసాయక జాలవిద్రుతై
రావణు, సిద్ధ చర సు
 ర ప్రమదాజన గర్భగోళ వి
స్రావణు, సద్భుజాతులిత
 రాజితశైల విభ క్తశక్తి వి
ద్రావణు, లోకపాలక ని
 రాకరణ ప్రవణైక రావణున్.

అంత హరునిపంపున దక్షునొద్దకుఁ జను వీరభద్రునిఁ బోలె రామభద్రుపంపున నంగదుండు రావణునొద్దకుం జనఁ దదితరవానరులు వచ్చి యతనికిఁ దోడ్పడిరి. అందఱుఁ గలిసి హోమగుండంబు పూడ్చి సమిధలు కలశములు మున్నగు పరికరంబులఁ బాఱవైచి ముష్టిఘట్టనంబుల వాని నొప్పించి శ్మశ్రువులు వట్టి యుయ్యెలలూఁగి బరబర నీడ్చి పెక్కువిధంబుల హింసించిన నతం డచలుండై యచలంబుఁ బోలె నున్నంగని కినిసి యంగదుం డతని యంతఃపురంబునకుం జని కరివరంబు సరసివాలంబుగాఁ గమలనిం దిగుచు మాడ్కి మండోదరి కచగ్రహణంబు చేసి తివిచి రావణు మంగళపరి ణామక్రమం బేర్పడ నాయమ యంగసౌష్ఠవంబు నాభరణం బులు తూల నీడ్చికొనివచ్చి లంకాధీశు నెదుటనిలిపి "యోరీ మాయలమారీ! రాముని వంచించి యతని దేవిని ముచ్చి లించి తెచ్చితివి! నేను బాహుసత్త్వమున నిర్వక్రపరాక్ర మంబున నీ మగువ నీ యెదుట నీడ్చుచుండ మగతనముమాని మౌనివైతివేల?" యని సోల్లుంఠనోక్తులాడి యా యంబుల నొప్పించిన మండోదరి యుభయ లజ్జాశోక పరాభవ రోష పరీతయై,

మ. "మయ దైత్యేంద్రునకుం దనూజనయి, సే
మంబొప్ప నీ పత్నినై,

చెఱపెట్టంగను నింద్రజిజ్జననినై
సర్వాంగనాపూజ్యనై
భయమెన్నండు నెఱుంగనట్టి నను ని
బ్భంగిన్ వనాటుండు ని
ర్భయవృత్తిం దలపట్టి యీడ్వఁగను గో
ఖాతైతి నీ ముంగలన్.

నీ విక్రమ మింకెన్నటికి? చిచ్చొడిగట్టికొన్నట్టులు సీత దెచ్చికొని యిన్ని యిడుమలపాలై యిప్పుడు మిణక రించిన వినియోగమేమి? నీ పాపఫలం బనుభవింపక పోన గునే? వీరుండవై యా వీరగ్రామణిం జయింపలేక లజ్జామానం బులు విడిచి మాసవై జయింపఁ జూచితివే? నీ మాయలు మంత్రములు తంత్రము లింద్రజిత్తుతో మంటఁగలిసె. అతఁ డున్న నేఁడీ పరిభవంబు నాకుఁ బాటిల్లునే? లెమ్ము. రాము నితో యుద్ధముచేసి యుత్సాహంబు వదలక యతని దివ్య బాణానలంబునకుఁ బూర్ణాహుతివి గమ్ము. భీరుండవై తేని సీత నిచ్చి శరణుసారు" మని దీనాలాపంబుల రోసంబుపుట్టఁ బల్కిన దశకంధరుం డుగ్రుండై సశరీరంబగు భయానకంబు ననుసరించి కరవాల మంకించి యంగదు బిట్టువ్రేసి సతీతిల కంబును విడిపించిన నద్దేవి రోదించుచు నంతిపురి కరిగె. మూర్ఛిల్లిన వాలిపుత్త్రుంగని మారుతి కోపించి లంకేశు

మస్తకంబు రక్తధారలు దొరుగఁ బొడిచి యందఱఁ గూడి కృతకృత్యుండై రామచంద్రు సన్నిధికిం జనియె. రాముఁ డంగదు నుచితవాక్యంబుల బహూకరించె.

—:మండోదరి నీతి:—

అనిర్వర్తితహోమకర్ముండై యమరవైరి యభ్యంతర మందిరంబున కేగి విలపించు కులసతిం గుస్తరించి "నేఁడు మనుజవనాటులఁ బొలిపుచ్చి నీ యనుమతిం దూలింతు. చింతింపకుము. రణమున నేఁడు రాముం జంపుదు నొండె వాని చేఁ జత్తు నొండె. దీని కన్యథాత్వంబు లేదు. నేన చచ్చితి నేని నీవు జానకిని వధించి యనలంబు చొరు" మని పలికిన మండోదరి యిట్లనియె.

"నాథా! ఇంకను రాముని గెలువను వాసగలదే? సనత్కుమార వచనంబులు మఱచితే? మీ తల్లిమాటలు నీటఁబుచ్చితే? విభీషణాతికాయ మారీచ కుంభకర్ణ మాల్యవత్ప్రముఖ నిఖిల నీతివిదుల పలుకుల విస్మరింతే? రాముఁడు నారాయణుండగుట నిజము. అతఁడు బాల్యమునఁ జేసిన దుష్టవధంబు వింటివే కదా! నీకు సద్బుద్ధిగఱపనివా రెవ్వరు? నీ చావు నీవ తెచ్చికొంటివి? నా మాట పాటింతువేని సీత నిచ్చి రాము నభయంబు వేఁడికొని విభీషణునకు అంక యొప్పించి యడవుల కేగి తపంబు సల్పుచుందము. కాదందు

వేని నీవు వధింపఁబడుట నిశ్చయము. పత్యనుగమనంబు నాకు లేదు. జరామరణంబులు లేకుండ మా తండ్రి నాకు వరమిచ్చె. సీతావధరూప పాపకృత్యంబు నే నొనర్పఁజాల. సరమకుఁ గింకరినై యిడుమలొందవలసిన విధి నాకుఁ గల్గె”

అని పలవింపఁదొడంగిన సరమా శ్వాసించుచు రావణుం డిట్లను. “ప్రియా! దిక్పతుల గెల్చి మునుల రక్తంబుఁ బీల్చి నే నిప్పుడు మునినైన లోకులు నగరే? పలుమాటలేల? నిజముదాఁపక చెప్పెద.

చ. ధరణితలేశ దివ్యశర
దత్తసుదుర్లభ ముక్తికామినీ
పరిణయ మంగళోత్సవము
భాగ్యమునం జనుదెంచెఁ గాన న
త్యురుతరమైన యీ శుభ ము
హూర్తము తప్పకయుండ నేఁగి నే
నిరతిశయానుభావ పద
నిశ్చలసుస్థితిఁ బొందియుండెదన్.

చ. అమితబలుండు రాఘవుఁడు
యాజకుఁడైనఁ దదస్త్రవహ్ని సా
క్ష్యమున మదీయ సాంద్రతర
కాండ శతాహుతు లొప్ప వేల్చి మో

దమునను ముక్తికాంత నిర
తంబుగ మంగళలీలఁ బెండ్లియౌ
విమల తదీయ భోగ పద
విశ్రుత సౌఖ్య నిరూఢిఁ బొందెదన్.

నీవు మిహిరుం బాసిన పద్మినివలెఁ దరువుం బాసిన తీఁగ పోల్కి మంగళస్ఫురణ దక్కి సౌభాగ్యహీనవై యుండు” మని యచటువాసి కొలువునకుఁ జని ప్రాణాపాయసమయ సహాయకరణుల ఖడ్గరోమ సర్పరోమ వృశ్చికరోమాగ్ని వర్ణులఁ గదనంబునకు రా నాజ్ఞయిడి ప్రస్థానభేరి మ్రోయించి సాలంకృతుఁడై సాయుధుండై సాటోపుండై యుదగ్రప్రత్యగ్రమహాగ్రహంబునఁ గపిలోక దురవలోకుండై కదలివచ్చి వలీముఖులం దలపడి కార్చిచ్చు శుష్కవంశాటవిం బేర్చు కరణిఁ గాల్పఁగడంగిన వనచరులును నరవాంఱ గొనక తరుల గిరుల శిలలఁ గరచరణనఖరదంతంబుల దైత్యుల నొప్పించిరి.

—:ఖడ్గరోముఁడు:—

ఖడ్గరోముండు నిరాయుధుండై వానరులలో దూఱిన వాని రోమఖడ్గంబుల ననేక కపులు దగులొని మ్రేలుచుండిరి. అది గని హనుమ వానిపైకి లంఘించి యసిరోమంబుల మునింగి రక్తసిక్తగాత్రుండై పోలి తెలిసి రోమాసిసగ్గతుండై మహో-న్నతసాలంబున నైవ నది వానికిఁ దగిలి పాడి

యయ్యె. మీాఁటి పై కుఱుకు నసిరోముంగాంచి పెద్ద కొండ
యొందు గొని తెచ్చి వానిపై నేమరించి వైచి జమునిపురికనిపె.

—:సర్పరోమ వృశ్చికరోములు:—

ఖడ్గరోముఁ డీల్గుటఁ గని సర్పవృశ్చికలోము లుగ్రులై
కపులఁ దఱుమఁజొచ్చిరి. సర్పరోముం గని విభ్రాంతులై
విమతులై కొందఱు వఱవ వృశ్చికరోముని రోమస్పర్శంబున
లబలబ మొత్తుకొనుచుఁ బాఱువారు కొందఱునై కోఁతి
మూఁకలు చెల్లాచెదరయె. తమ బలంబు నొగులుటను
సహింపక యింద్రపౌత్త్రుండు విజయోద్రేకంబున నింగికి
లంఘించి రోమసర్ప దశనంబుల కోర్చి వాని శిరంబు స్ఫుర
ద్భిదురసంకాశ ముష్టిఘట్టనంబునఁ బగిల్చి సింహనాదంబు
చేసె. కపిసేనం జొచ్చి దేహంబు విదిర్చి దుస్సహాతర
రోమోత్కర నిస్సరదురుగరళంబునఁ బరుగులిడఁజేయు
వృశ్చికరోమునిపైకి నీలుండు దాఁటి విషబాధ నైరింపంజాలక
మగిడి తెగించి తద్వేధం గణింపక యురుముష్టిఘాతంబున
మొగంబు వ్రేసి దంతంబులు డుల్చి మైందునిచేతి తరువుం
గైకొని చావమోఁది కాలుప్రోలికి సర్పఖడ్గ రోములతోఁ
గూడఁ బోనంపె.

—:అగ్నివర్ణుఁడు:—

అంతఁ జటుల నిశ్వాస సమీరణ సంధుక్షిత నిజాంగ
దహన ప్రభామండలుండై యగ్నివర్ణుండు, కాఁపులు చేలఁబు

లుఁగులఁ దోలులీల బలీముఖుల భస్మీకరించుచుఁ దఱిమి తఱిమి రామునెదుట నిల్చి పెక్కు ప్రదరంబు లతని మేన నాటించిన రఘువీరుండు కోపించి యొక్క భల్లమున వాని విల్లు దునుమాడి పైఁబడి మీఱి వచ్చుచున్నవానిపై వారుణాస్త్ర మేసినవాఁ డద్దానితోఁ జప్పచల్లాఱి చచ్చె.

—:రామ రావణ యుద్ధము:—

సీ. విలయ కాలానల విల ధూమ తతిక్రియ
వికట భయానక భ్రుకుటిదనరఁ
జటుల దంష్ట్రాకోటి జటులాంశుమండలి
విపులార్క దీప్తితో వియ్యమంద
దహన కుండోపమ మహాదత్షి వివరంబు
క్రమమున నులాక్కశ తమునుసీన
దశవదనోదగ్ర దంతంబు లన్యోన్య
ఘట్టన విస్ఫులింగములు నెఱపఁ
బద్మగర్భాండభాడంబు పగుల నడువ
నంబురాసులు నేకు నాక్రాంతచేయఁ
దలఁచు కైవడి దట్టించి దశముఖుండు
కినుక పెరుఁగంగ రాముని నెనసెనపుడు.

అట్లు చేరి తన లావును మునుగొన్న జయంబులును విశదీకరించి రాముని బెదరింపఁ జూచిన నతండు నవ్వి "దుర్మ

దాంధా! నీ లావు నే నింతకు మున్న రెండు మాఱు లిచ్చటన
యెఱింగితి. నాకన్న మున్నుగ వాలియుఁ గార్తవీర్యుండు
నెఱుంగుదురు. ప్రగల్భము లేల? నీ బహుముఖంబులే బహు
భాషలకుఁ గారణమయ్యె" ననవుడు వింశతిభుజుండు "బహు
భుజంబులు బహుతరప్రాజ్యసత్త్వమునకు మూలమయ్యెనని
నీ వెఱుంగవు గాఁబోలు" నని హసించుచు గుణధ్వని చేసి
దివ్యాస్త్రంబుల మంత్రపూర్వకంబుగఁ బెక్కులు ప్రయో
గించె. అన్నింటి కన్ని పరపి జానకీపతియు వాని నడఁచుచు
వచ్చె. ఇరువుర యస్త్రములు లెక్కకు మీఱి యాకసంబు
గప్పి రణభూమి గాఢతిమిరంబు వ్యాపించె. రామ రావణ
రణంబు గనవచ్చిన దివ్యుల కేదియుఁ బొడసూపదయ్యె. ఇరు
వురు జయైకాకాంక్షులై వెనుదీయక యస్త్రప్రౌఢిమ సర్వం
బును సంపూర్ణదోస్సారంబును హస్తలాఘవంబును మంత్ర
శక్తియు వనచర నిశాచర ఖేచరులచ్చెరువందఁ బ్రదర్శించిరి.
ఏతదాయోధన దర్శనాపేక్షు రథికుండై చనుదెంచిన మఘ
వుండు తనయరదంబును రాఘవున కంపె. దశస్యందననందనుం
డానందంబున సంక్రందను స్యందనం బధిరోహించి మాతలి
సారథ్యంబును మెచ్చుచు నెడత్రెవ్వక పోరొనర్చె. అబ్బవరంబు
రేయింబవళ్ళు విరామంబు నడ తెఱపిలేక రెన్నాళ్ళు జరగె.

క. ఛిన్నుండై బంధువధా
ఖిన్నుండై శోకజనిత ǂ బాష్పజల ఝరి

క్లిన్నుండై రోష కట
చ్ఛిన్నుండై యుండెఁ బుణ్య జనవిభుఁ డచటన్.

క. ధీరుండై ప్రకటిత దో
స్సారుండై విజయలబ్ధ సాంద్రానందో
దారుండై చిత్రహారా
కారుండై రాముఁ డలరెఁ గదనక్షోణిన్.

అంతకంతకు రాముఁడు విక్రమించి రావణు నొప్పించిన వాఁడును ద్విగుణీకృత రోషుండై రాముని నెఱకుల గల నొప్పించె. అయ్యవసరంబున నగస్త్యుఁ డరుదెంచి సకలై శ్వర్య మంగళసౌఖ్యావహంబును సకలదురిత దూరీకరణచణం బును నగు నాదిత్యహృదయంబు రాఘవున కుపదేశించి "రామా! భవద్వంశకర్తయు భువనబంధుండగు నాదిత్యు నారాధింపుము. నీకు జయంబయ్యెడు", మని యరిగె. ఇనకుల తిలకుండు సర్వదేవమయుండగు భానునారాధించి యనంత తేజోవిరాజితుఁడై రావణుం బ్రతిఘటించి మించి సౌమ ల్లఁ జేసినఁ గాలకేతుండు రథంబుం దోలంగంగొని చనె. కొంత వడికి రావణుండు తెలిసి యుగాండ ప్రళయ సంభ్రాంత కృతాంతాకృతియై యాగ్రహించి 'రాముఁడు నన్ను రథంబు నేల తోలఁగించితి' వని పదరిన వాఁడు 'నాధర్మంబు నోవ రించితి' వని మరలించి సంగరభూమికిఁ దెచ్చె. అంత యుద్ధా

స్థితి యుద్ధంబు ప్రవర్తిల్లె. ధీరోదాత్తవరేణ్యుండైన రాముం డును ధీరోద్ధతుండైన రావణుండును మండలీభూత కోదండులై నీరంధ్రీభూత దిక్తటంబుగా శూన్యీభూత సప్తాశ్వంబుగ సంత మస సంపాదకంబుగ శరగ్రహణాకర్షణసంధాన మోక్షణాదు లెఱుంగబడరాక నిశితప్రకాండకాండంబులు మెండుగాఁ బరపి చలంబు బలంబు గదిరి యెదిరి స్రుక్కక యుక్కడక్కక నిమి షార్థంబేని యుడుగక సదృశ సాహస సంపాదన సమరవ్యా పార బల శస్త్ర శౌర్య చాతుర్యులై నిద్రాది వ్యవహారంబుల నిర్జించి వర్జించి క్రమక్రమ ప్రవర్ధమాన భుజలాఘవులై సప్తా హోరాత్రంబు లెడతెగని సమరంబు సలిపిరి. ఏడవనాఁడు పెక్కుదుర్నిమిత్తంబులు వైశ్రవణునకును శుభసూచకంబులు దాశరథికిఁ దోచినవి. దైవబలహీనుండగు లోకవిద్రావణుని రథ రథ్య సారథుల లోకత్రాణుండు నుగ్గుచేసి మించి యర్ధ చంద్రప్రదరంబులఁ బడింట వాని పదితలలుఁ గణుక్కునఁ గత్తిరించె. అప్పటి యాశ్చర్య మేమనవచ్చు! విలంబము లేక వానితల లెప్పటియట్ల మొలిచె. రాముఁ డబ్బురపడి వాని తలలు చేతులు మరలఁ గత్తిరించె. మరల మొలిచె. ఆశ్చర్య సాభ్రమంబులు పెనగొన నినవంశ్యుండు జంత్రపుబొమ్మ కీళ్లు దప్పించునటులు వాని కరశిరంబులఁ ద్రుంచుచుండ నవి మణి గణ కేయూరకంకణ కుండలమండితంబులై మార్తండ మండ లములఁ బోలె మెండుకొని తెగినవియుఁ దెగుచున్నవియుఁ

దెగునవియు నెగిరినవియు నెగురుచున్నవియు నెగురఁగలవియు మరలినవియు మరలుచున్నవియు మరలునవియుఁ గ్రిందఁ బడినవియుఁ బడుచున్నవియుఁ బడనున్నవియు నై కాలత్రయ క్రియాసమన్వితములై చిత్రగతుల గగనకాళి కపాలమాలికా నిభంబులై గరుడధ్వజుఁడగు రామచంద్రుం గఱవఁ బొదువ వచ్చు నురగ రాహువుల కరణి హుంకారములతో నాయుధ ప్రయోగంబులతో నొప్పారె.

ఉ. "ఉన్నవి యున్నయట్ల తల
లుర్వికిడిగ్గ శిరః ప్రవాహముల్
మున్నొకసారె నిండు దెగ
మోపిన సాయక మట్లగుణఁడఁ జాఁ
గెన్నటఁ దూపువెల్లి" యని
ఖేచరకోటి నుతించె నంచితో
త్పన్న దశాస్యరాఘవ త
పఃకర లాఘవ చిత్రసంపదల్.

ఉ. త్రెవ్వెడుగంటులన్ గురువు
దేఱెడు నెత్తురురాకమున్న యే
నొవ్వియు నేవికారము మ
నోగతిఁ జెందకమున్న సాయకం
బవ్వలఁ బోకమున్న మకు
టాగ్ర విఘట్టన రాణ మొప్పఁగా

సువ్వున నుప్పతిల్లె నను
రోద్వహా మూచయంబు గ్రక్కునన్.

అలయక తెప్పపాటంత కాలవిలంబము లేక రాముఁడు రాక్షసరాజు శిరశ్శిరంబులఁ ద్రెంచుచుండ నవి పీడక దప్పక విచ్ఛాయనొందక కుందక చెడక హాసంబు విడువక త్రాసంబు వడక చేవ విడక యూపులింతలు లేక యాగ్రహంబులు గ్రుప్పుచు జూడ్కులు ధిక్కృతులు బొమముడిపాటులు పెడబొబ్బలార్పులు హుంకృతులు గలిగి రావణుం బొగడుచు రాముం దెగడుచుఁ బర్వతోపమంబులై పడియె. ఇట్లు దేవ దానవ లోక కరంబుగా రాఘవేంద్రుండు రక్షోధీశు బాహూత్తమాంగంబులు ఖండించి ఖండించి విసిగి "బళిరే! వీని సత్త్వంబు గ్రొత్త! సంగరస్థల స్థేమంబు చిత్రంబు! శస్త్ర నైపుణ్య మగణ్యము! కరశిరస్సము ద్భూత ప్రకారంబు వింత! వీనిం జంపఁజాలనో! అస్త్రముల వీనికిఁ గీడు లేదో! అక్కటా! వీనిం జంపకున్న నా వీరోద్యమంబేల? వీనికి విలయమే లేదా?" యని వితర్కింపం జొచ్చిన నతని ముఖలక్షణం బింగితజ్ఞుండగు విభీషణుం డెఱింగి రహస్య ప్రకారంబున "రామా! బ్రహ్మవరంబున వీని యుదరంబున నమృతము కుండలాకృతిం దాల్చి యున్నది. ఆగ్నేయాస్త్రంబున దానినింకించి పదపడి నూటతొమ్మిదిమూఁడులు తునిమిన వీఁడు త్రుంగు" ననిన నాకీలెఱింగి జానకీశ్వరుం డాగ్నేయ శరంబున శత్రు నుదరస్థామృత మింకించి యశ్రమంబున నూట

తొనిమిదిమూఁడులు తలలు చేతులు ద్రెంచి కడసారి యొక
తలయు రెండుచేతులు నిలిపి త్రుంచె. ఉత్పాటిత సటంబగు
కంఠీరవంబు డాఁబున దైత్యేశ్వరుండు విజృంభణంబు దక్కియు
ధైర్యంబవలంబించి "యకటా! మున్నెవ్వరెఱుఁగని యీ రహ
స్యంబు విభీషణునివలనఁ గదా బహిర్గతమయ్యె" నని మహా
శక్తి యొండుగైకొని యతనిపై వైచిన దానిని పత్తునియలుగ
రాముండు ఖండించి వానితో లీలమెయిఁ గొంతసేపు పోరె.
జగములెల్ల నొకతల; రావణుఁ డొకతల యనుట సార్థకంబు
గావించి యన్నియున్నయ ట్లనిపించుచు దైత్యభర్త రాము
నితోఁ బోరుచుండె. మాతలి "మహానుభావా! వీనితోఁ
జెరలాటమేల? వీని తలలు చేతులు మరల నుప్పతిల్లునో
యేమో! ఆలసింపక బ్రహ్మాస్త్రంబున వీనిఁ దునిమి లోక
త్రాణంబు సేయు" మన రామభద్రుండు పైతామహాస్త్రం
బందికొని శత్రు నురస్థలిం దృష్టినిల్పి తెగదీసి యేసిన నమ్మహా
స్త్రంబు లోకప్రళయంబు సేయు చందంబునఁ జనుదెంచి
రావణు నురస్స్థలంబుఁ గాఁడి తదీయ ప్రాణంబులఁ గ్రోలి వీఁపున
దున్నిపుత్త్రికై వగచు ధాత్రికి రాక్షసాధము వధియించితనని
చెప్పంబోవుపగిదిఁ బాతాళంబు సొచ్చి నిమిషార్ధమాత్రంబునఁ
గ్రమ్మఱి బ్రాహ్మణుండైన రావణుం దెగటార్చిన యఘంబు
వాపికొనఁ దారకనాముఁడగు రాము నాశ్రయించె నన
నతనిదోన చొచ్చె. రామాస్త్ర క్షతరక్తధార లురల రాక్షస

రాజు వజ్రభిన్నకుధరంబు విధంబున శరాసనంబు శిథిలీ భూతత్వ మొంద నాక్రందించుచు ధరణింగూలె. కపు లగ్గించిరి. నిలింపులింపునఁ గుసుమవృష్టిం గురిసి కీర్తించిరి. భూమిజాధిపుఁడు భుజసామర్థ్యంబున భూరిభయంకరు భూమి పాలుచేసి విజయలక్ష్మిని విలసిల్ల వరించి కీర్తికాంతం భరించి విజయధ్వజంబు ధరం బ్రతిష్ఠించుకై వడి విలు దించి యెక్కు దించి 'శరంబులు కరంబునఁ బట్టినందులకుఁ గృతార్థత్వంబు గంటి' నని కోదండంబు లక్ష్మణుని చేతి కిచ్చె.

—:విభీషణ పట్టాభిషేకము:—

అన్న పాటునకు నాపరాని శోకంబున విన్నఁబోయి విభీషణుండు విలపించె. మందోదరీప్రముఖ నిఖిలరావణ కాంతాజనంబులు పొలికలనికేగి రావణ శవంబుపైఁ బడి పరి పరి విధంబులఁ బెల్లుగ నురపిల్లిరి. రాముఁడు విభీషణుం దేర్చి కాంతాజనంబులఁ దేర్ప రావణున కగ్నిసంస్కారంబు గావింప నియమించిన నతండరిగి యట్లు కావించి మరల రాఘవుం జేర వచ్చె. ఆవల రామానుమతంబున లక్ష్మణసుగ్రీవాదులు లంక కరిగి విభీషణునకుఁ బట్టంబుగట్టి యతనిచేఁ బూజితులై యందఱు రామునిసన్నిధి కేతెంచిరి. ఇంతలో మారుతి రాఘవు నాజ్ఞ నశోకవనికిం జని రామదేవికి రామవిజయంబు దెలిపి క్రమ్మఱియె. పదపడి రాముని కోరిక మేరకు విభీషణుండు నరమంబంపి సీతకు మంగళస్నానంబు సేయించి దివ్యభూషణం

బులు కైసేసి డోలికయందిడికొని తేర నియోగించి వారవ్విధిం గావించి తోడ్కొనిరాఁ దాను వేత్రపాణియై మున్నుగ నడ తెంచె. సీత యల్లంతదూరమున నిజేశుందర్శించి మేనఁ బులక లెగయఁ బరమానంద ప్రపూర్ణయై యాందోళిక నవరోహించి పాదచారిణియై భర్తృచరణ సన్నిధానంబునకేతెంచి ప్రదక్షి ణించి చాఁగిలి దండవత్ప్రణామంబుచేసి హర్ష స్నేహ ప్రేమం బులు ముప్పిరిగొన నద్దేవి యానందాశ్రుపూర్ణనేత్రయై వినమ్ర శరీరిణియై మనోగత దుఃఖం బపనయించికొని నిలిచె. అట్లు నిలిచినసీతంగాంచి రామచంద్రుండు హృదయాంతర్గతక్రోధుండై యిట్లనియె. "అతివా! నీకై మదాంధ రావణమర్దనం బొన రించి పౌరుషమున మర్షముఁ బ్రతాపము బాహుబలముఁ బ్రతిజ్ఞ ఫలింపంజేసి వైరి కృతావమాన విషదిగ్ధశల్యముం బుచ్చివైచి పరిపూర్ణ మనోరథసిద్ధిం గృతార్థుండనైతి. మాను లగువారు మానంబుగావఁ గావింపందగు కార్యంబొనర్చి దుర్యశః పంకంబు గడిగి ధన్యుఁడనైతి. రాక్షసాపహృతవై పెద్దకాలంబు శత్రునింట నిల్చిన నీ యందు నాకుఁ బరిగ్రహ బుద్ధి లేదు. ఇక్ష్వాకురాజన్యులు గాంభీర్యౌదార్యాన్నతా ది గుణంబులు పాటించి లోకాపవాదంబునకోడి త్యాజ్యంబైనచో శరీరంబైనఁ ద్యజింతురగన నీ వెంత? నిన్ను విడిపింపకుండిన యశో లజ్జామానచ్యుతుండ నగుదుఁ గావున నీ చందం బను ష్ఠింపవలసె. భరత లక్ష్మణ శత్రుఘ్న సుగ్రీవాంగద విభీష

ణాదులలో నీ కెవ్వరిష్టంబు వారి యింట నొదిగియుండి నీ
కాలంబు వెడలింపుము"

ఘోరశరోపమంబులగు నివ్వాక్యంబులు విని సీత
యగ్నింబడిన పుష్పంబుపోల్కి వాడి వణంకి తన శరీరంబునం
దా నణంగుకరణి సుక్క ధరణింజొచ్చుగతి దభాలునం గూలి
యుల్లంబోయి కొంతసేపటికి లేచి దుఃఖరసాధిదేవతింబోలెం
జూపట్టుచు గద్గదకంఠియై యిట్లనియె. "నాథా! మహాత్ముం
డగు జనకునకుం దనయనై దశరథునకుం గోడలనై ధర్మ
మూర్తివగు నీకుం బత్నినై యొప్పు నాకుం బాపచింత గలు
గునే? బాల్యంబునాండె నన్నుం బరిగ్రహించి యప్పటినుండి
సహసంవాసంబు సహసంచారంబు సహసల్లాపంబు సహ
క్రీడ సహసంసర్గంబు గావించియు మత్స్వభావం బెఱుం
గకుండజేసి నేను సక్కముగ నిప్పుడు మిక్కిలియునిహతనైతి.
ఇంత యనుమానంబు నీ మనంబున నిండియుండిన నాండే విస
ర్జింపక మత్కళలం బరసిరమ్మని హనుమ నేలపంపితి? అవ్వీ
రోత్తముండు ప్రత్యక్షంబుగా నప్పటి నా వృత్తాంతం బంతయు
నెఱింగియున్నవాండు. నీ నైరాశ్యం బెఱింగించి యుంటివేని
లోలో నెరియుచుం బ్రాణత్యాగంబు సేసియుందుంగదా!
దానంజేసి నా కింతకాలంబు భవద్వియోగ జనితవ్యథ లేకుం
డుగాదె! నీకును బ్రాణసందేహాకరంబైన యీ వృథాశ్ర
మంబు దప్పుంగాదె! భవత్సఖులైన సుగ్రీవాదులకును నిష్ఫ

లంబైన యీ పరిక్లేశంబు గలుగకుండదుగాదె! లఘుచిత్తుని
చేతంబోలె నీ చేత స్త్రీత్వంబు పురస్కరించుకొని క్రోధంబు
ప్రకటింపబడియెం గాని మద్విమల విశాలశీలంబు విదితంబు
గాదయ్యె నా యయోనిజాత్వంబైన విచారింపవైతివి. నీచే
నగ్నిసాక్షికంబుగ నాచరింపంబడిన పాణిగ్రహణం బప్ర
మాణంబయ్యె. పురుషులు తమ పొందుతుల నమ్మనిచోఁ
జిత్తవృత్తిం బరీక్షింపవచ్చుం గాని దూషసహిత శిరోపమానం
బులైన పరుసని పలుకుల సభలో నొనాడఁ జెల్లునే?” అని
రోదనంబు సేయుచుఁ దత్పరిసరంబునఁ దనవలె శోకించుచున్న
లక్ష్మణు నవలోకించి “నాయనా! లక్ష్మణా! నీ యన్న
వాక్యంబులు వింటివే? విశాతివాగ్భాణంబుల నన్నిట్టు
నొప్పింప న్యాయమే? నా చిత్తవృత్తి నీ వెఱుంగవటయ్యా!
నా పాపఫలం బిట్లు నన్నుఁ బరిపీడింప నొకరి నననేల?
వత్సా! యీ వ్యసనంబునకు భేషజమైన చితిఁ బేర్పుము.
అందుఁజొచ్చి విశుద్ధశీలంబుఁ బ్రకటించెద” నన లక్ష్మణుం
డన్న మోమును గాంచి తదాకారసూచిత కార్యభావమెఱింగి
చితిపేర్చె జ్వాలలు రగిల్చె. అప్పీరపతివ్రతా శిరోరత్నంబు

—:సీత సౌశీల్య నిరూపణము:—

పతికి బ్రదక్షిణించి నమస్కరించి యగ్నికట్ల యొనరించి
కరంబులు ముకుళించి,

సీ. "అనిశంబు మచ్చిత్త । మాత్మనాథునియందుఁ
దవిలి వర్తించుట । తథ్యమేని
పతితదుష్టత్వ శం । కితమైన యౌనుర్వి
నతిశుద్ధచారిత్ర । నైతినేని
కరము వాఙ్మానస । కర్మంబుచే మనో
ధిపు మాట మీఱక వ । ర్తింపనేని
రవిచంద్ర దిగ్వాయు । రాత్రిసంధ్యాది ప
భూనభంబులు సర్వ । భూతములును
సకల దిక్పాలకులు నాదు । సచ్చరితము
సర్వము నెఱింగియుండుట । సత్యమేని
పవనహేతువు లోకైక । సాక్షియైన
చిత్రభానుండు నన్ను ర । క్షించుఁగాత!"

అని వీతశంకితాత్మయై నిశ్చలాత్మయై యభ్రంకషకీలుండైన కీలికీలలఁ బ్రవేశించె. పరమపావనియగు సీత కతన నేను బరిశుద్ధుఁడనైతినని యనలుండు పొంగినాఁ జటచట ధ్వనులతో జ్వాల లుప్పరంబున కెగసె. సీత దహనశిఖావృతయైనం గనుంగొని దానవాంగనలు శోకింప నిశాచరులు దుఃఖింపఁ గపులాక్రందింప సుగ్రీవుండు బెగ్గిల విభీషణుండు పారవశ్యంబునొంద నంగదుండు విన్నఁదనంబు నొంద హనుమంతుండు ఖేదమంద లక్ష్మణుండు వగలఁ బొగుల రాఘవుండు వాఙ్ముఖుండై నిర్వేదింప సురలనుచితంబన సాధ్యులన్యాయంబన యక్షులనుపేక్షణీయంబనఁ

చరాచరంబులు దృశ్యాదృశ్యంబులు నగు భూతంబులు తల్లడిల్లఁ బంచభూతంబు లాక్రోశింప నొక్కపెట్టునఁ గోలాహలంబయ్యె. సర్వదేవతలు సురజ్యేష్ఠుని మున్నిడికొని యటకు విచ్చేసి రామునిస్తుతించి సీత ప్రఘాతయని పరిగ్రహణ యోగ్యయని నుడివిరి. జాతవేదుం డస్వేదబిందుజాలాంచితయు నమ్లానవదన పంకజయు నక్లిష్టతనువల్లికయు ననవసన్నాంగరాగయు ననాహతదుకూలయు ననిర్ధూతకేశకలాపయు నకంపమూర్తియు నవిచ్ఛిన్న హారాద్యలంకారయు నవిపాయానసూయాదత్త పుణ్యాంగరాగ గంధబంధురమూర్తియు నైన తొంటి క్రియనున్న వసుమతీజాతను రఘువరుని సన్నికర్షంబున కెత్తికొని వచ్చి ముందట నిల్పి,

క. "శుచినై జగములకుఁ బరమ
శుచిత్వమొనరించు నే వసుమతీ తనయా
రక్షితప్రవేశమునఁ గడు
శుచినైతిఁ గృతార్థభావ సుభగుఁడ నైతిన్"

అని 'సీతం బరిగ్రహింపు' మని బ్రహ్మాదు లట్లయొనర్పుమనిరి. రాముఁడు సీతాకరగ్రహణంబు సేసె. కవులుల్లసిల్లిరి. లక్ష్మణాదులకుఁ బ్రమోదంబాదవె. దిక్కులు తెలివొందె. లోకంబులాకులత్వంబు మానె. పదపడి పితృదేవతలతో వచ్చిన దశరథుండు కుమారులం గోడలి నభిమా

ర్పించి దీవించి ప్రియవాక్యంబులాడి దేవతలతో నేగె. ఇంద్రుని వరంబునఁ గుంభకర్ణుని నోటఁబడి మెదిగి యిగ్గిన వానరుచక్క రణమున గూలిన కపులెల్ల నిద్రనుండి మేల్కొన్న తెఱంగున లేచిరి. రాము నవలఁగ మెచ్చింగి విభీషణుండు పుష్పకంబు గొని తెచ్చి తాను నాలుబిడ్డలతో రామునితోఁ బయనింప సన్నిద్ధుఁ డయ్యె.

—:సీతారాముల ప్రయాణము:—

రామ సహకారులు వానరు లయోధ్యను, రామ పట్టాభిషేకమహోత్సవంబును గనఁ గుతూహలులై ప్రార్థేయ పడినవారి వేఁడికోళ్లఁద్రోవంజాలక వారి రాకను సమ్మతించి రామభద్రుఁ డందఱితోఁ గౌబేరయానంబెక్కిన, నవ్విమాన రాజంబు దివికెగసి విస్తారితపక్షమరాళ యూథసమూధంబై సాను లీలాచల శారద నీరదంబైన మేరునగంబు గతిం దేజ రిల్లుచు నతిత్వరితగమనంబునఁజనియె. దారింగల విశేషంబుల సీతకుఁ జూపుచు రాముఁడు సేతూత్తరభాగంబున విమా నంబు నిలిపి డిగి రావణసంహరణ కారణజనిత బ్రహ్మహత్యా నివారణార్థంబు సముద్రస్నానంబును శివలింగార్చనంబును జేయ నిశ్చయించి విశ్వేశ్వరలింగంబు గొని తేర హనుమంతు నియోగించి తన ధనుష్కోటి నొకవలయంబు గీచి తత్ప్రదే శంబున సీతాసమేతుండై స్నానమాచరించి మారుతి రాక కెదురుచూచుచుండె.

—:రామలింగ ప్రతిష్ఠ:—

శుభలగ్నమాసన్నమయ్యె హనుమరాకకై చింతించి రాముఁడు తచ్ఛుభలగ్నంబున నిసుముతో లింగంబు గావించి పూజింపనారంభించె. ఇంతలో హనుమంతుండువచ్చి తన యాలస్యమునకుఁ బరివేదింప రాఘవుఁ డూరార్చి "నాయనా! మించినది లేదు. దీనిం దొలఁగించి నీ తెచ్చినలింగముం బ్రతిష్ఠింపు"మన వాయుజుండా రామ ప్రతిష్ఠితలింగంబును బెల్లగింపలేక డిల్లపడిన నమ్మహాత్ముండు సమాశ్వాసించి తత్సమీపంబునఁ బ్రతిష్ఠింపించి హనుమత్ప్రతిష్ఠితలింగరూపుని మున్నర్చించి తరువాతఁ దా నిలిపిన శివరూపంబు నర్చించి బ్రహ్మహత్యం బాపికొని యటనుండి ససైన్యంబుగ విమానారూఢుండై కదలి కిష్కింధా ప్రాంత భూమినిలిచె. అట సీతాహితార్థంబు వానరులు తమతమ పత్నులం దోడ్కొనివచ్చిరి. అందఱుఁ గలిసి మరలఁ బయనించిరి. శ్రీరాముఁడు తా సీతను రోసిన స్థలములఁ జూపుచు భరద్వాజాశ్రమంబు సమీపించి యతనిచే నుత్తరువుగొనువాఁడై డిగ్గి సీతా లక్ష్మణసహితుఁడై యమ్మునికిఁ బ్రణామంబుచేసి యతని మన్ననలంది భరతాదుల శుభంబులడిగి తాము పడిన పాటులెల్లఁ దెలిపిన నతండు భరతునిరీతిఁ దెలిపి మీ కష్టంబులచే విశ్రుతకీర్తియు లోక..మకరంబును గల్గెనని ప్రశంసించి మద్దత్తంబైన యతిథిసత్కారంబుఁ బ్రతిగ్రహించి రేపకడ సాకేతంబునకుఁ జనుమనిన నతని మఱదల

రఘువరుండు శిరంబునఁ బరిగ్రహించి సంతుష్టుండై యంజ
నేయుంగని "మారుతీ! నా వనవాసవత్సరంబులు పదునాల్గు
నిన్నటితోఁ బరిపూర్తియయ్యె. నేఁ డయోధ్యఁ జేరనేని
భరతుండు వహ్నిం జొచ్చునట్లు ప్రతినపట్టినవాఁడు. ముని
మనస్సంతుష్టికై నేఁ డిట మసలవలసె. మత్సందేశముం
దెల్పి సీతను, దత్సందేశంబు దెల్పి నన్నును, సంజీవనిం
దెచ్చి లక్ష్మణుం బ్రదికించిన ప్రియసోదరా! నేఁడు నా రాక
దెలిపి భరతుని ప్రాణంబులు గూడ నిలుపుము. పవన జవ
నంబునఁ బోవలయు" ననినఁ బావని రామవాక్యంబుల
నాదల ధరించి సోత్సాహుండై యంతరిక్షంబున కుద్గమించి
శృంగిబేరంబున కేగి గుహునకు రామాగమనంబు దెల్పి యట
నుండి మరుద్గమనంబున నందిగ్రామంబున కేగి జటావల్కల
ధారు శాముఁరూపు రామపాదుకా సేవానిరతు భరతుఁగాంచి
తా మున్నుఁగాంచి రాముండని శంకించిన పుణ్యపురుషుం
డితండయని నిశ్చయించి యట డిగ్గి,

చ. కడిమిమెయిన్ రఘూత్తముఁడు
 కానకుఁబోయి చతుర్దశాబ్దముల్
కడచనె నమ్మహాయశుఁడు
 క్రమ్మఱవచ్చెడు జాడలేదు నే
నుఱుగక యన్నమాట మది
 నుంచెనొ లేదొ యటంచు దీనుఁడై

యడలుచు నున్నవాని సుగు
ణాభిరతుం భరతుం గనెన్ రహిన్.

కని యతనికి వందనం బాచరించి రామాగమనంబు సంగ్రహంబుగఁ దెల్పి పదపడి సవిస్తరంబుగా రాముని చరిత్రంబెల్ల శ్రవణానందంబుగ వినిచె. భరతుఁ డపారకుతూహలుండై హనుమంతుని బహువిధంబుల సత్కరించి ప్రధాన వర్గంబులకుఁ బౌరులకు రామాగమన వృత్తాంతంబు దెలిపి పురం బలంకరింప నియోగించి మఱునాఁడు మంగళవాద్యంబులతో రాము నెదుర్కొన నేగెను.

—:అయోధ్యాప్రవేశము:

భరద్వాజు నాశ్రమంబున శ్రీరామచంద్రుండు వానరులతో విందుగుడిచి యతని వీడ్కొని పుష్పకం బధిరోహించి పయనించి శృంగిబేరపురంబుకడ నిలిచి గుహుని సమ్మానంబు లందికొని యతనిం దన వెంట నిడికొని యట నుండి కదలి భరతునకుం బొడకట్టెను. విమానగతుని రాముని గాంచి భరతుం డానందాశ్రు సమ్మిళితనయనుండై పులకితదేహుండై నమస్కరించెను. రాముఁడు పుష్పకమును బుడమి కవతరింపఁజేసెను. భరతుండు మహోత్కంఠుండై విమానం బెక్కి రామచరణంబులు శిరంబు సోఁకఁ బ్రణమిల్లె. రామచంద్రుండు ముదితుండై చిరకాలంబునకు సంలబ్ధదర్శనుం

డైన భరతుని గ్రుచ్చి యెత్తి యుత్సంగంబునఁ జేర్చి గాఢం
బుగ నాలింగనంబుచేసి యానందజనకంబులైన ప్రియవచ
నంబుల గారవించె. పిదప భరతుండు సీతకు నభివాదనం
బొనరించి కృతప్రణాముఁడైన లక్ష్మణుం బరిష్వజించి సంభా
వించి పదపడి సుగ్రీవ విభీష ణాంగద నీల జాంబవదాదుల
వేర్వేఱఁ గవుంగిలించి యాదరించి వారి సహాకారంబులం
బ్రశంసించి గారవించె. అంత సీతారామలక్ష్మణులు తల్లులకు
నమస్కరించి వారి యాలింగనాశీర్వాదంబులఁ బడసి వసి
ష్ఠాద మహాత్ముల కంజలిగావించి ప్రధానులఁ బౌరుల మన్నిం
చిరి. అందఱు నందిగ్రామంబుఁ బ్రవేశించిరి. అప్పుడు

చ. భరతుఁడు హేమరత్నమయ
పాదుక లెంతయు జానకీ మనో
హారు చరణంబులం దొడిగి
యంజలిఁజేసి, "మహానుభావ! క్ర
మ్మఱఁ బురికేగుదెంచిన నృ
పాలుని నిన్నిటు గాంచినందునన్
బరువడి నా మనోరథము
పండెఁ గృతార్థుఁడనైతి నిత్తఱిన్.

ఉ. నీదగురాజ్య మిందనుక
నీప్రభు తేజము నాశ్రయించి మ

ర్యాదలు దప్పకుండ నయ
మారఁగఁ బ్రోచితి నింక దీని స
త్త్యాదరవృత్తిఁ జేకొను మ
హాత్మ! పురంబు బలంబు గోష్ఠకో
శాదిక మంతయున్ దశగు
ణాధికమై యలరారెఁ జూడుమా!”

అని రాజ్యమప్పగించె. రాముఁడు భరతుని ప్రార్థనం బంగీకరించి ప్రసాధకులవలన విశోధిత జటామండలుండై పరిమళ సలిలంబుల మజ్జనంబుగావించి దివ్యాంబర కేయూర తార హారాదుల ధరియించి సముజ్జ్వలుండయ్యె. తదుపరి భరత లక్ష్మణ శత్రుఘ్నులు జటాజినంబులు వీడి దివ్యాలంకార శోభితులైరి. సుగ్రీవ విభీషణాదులుం బ్రసాధితులై మోదమందిరి. అంత నందఱు దివ్యరథంబులెక్కి యయోధ్యం బ్రవేశించిరి. పురజనంబు లాబాలగోపాలం బెదురువచ్చి సుగుణాభిరాముని రామునిగని నిర్భర హర్షచేతస్కులైరి. మఱునాఁడు

—: శ్రీరామ పట్టాభిషేకము :—

క. క్షితినాథ శిఖామణికిని
జితవైరికి భక్తలోక చింతామణికిన్
దతకాంత నిశామణికిని
బ్రతీతతేజోనుభావ భర దినమణికిన్.

పట్టాభిషేకమహోత్సవము జరుపంబడునని పురమెల్ల ఘోషణములు వినఁబడియె. పట్టనమెల్ల నలంకారశోభిత మయ్యె. పురజనంబులును సువస్త్రమాల్యభూషణభూషితులై సంతుష్టాంతరంగులై యుండిరి.

కపులు సముద్రజలంబులు కనకకలశంబులఁ గొని తెచ్చిరి. వసిష్ఠ వామదేవాదులు వేదబుక్కులఁ బఠించుచుం డిరి. సర్వకార్యంబులు శాస్త్రోపదిష్టంబుగా జరుపఁబడియె. రాముఁ డెల్లరకు బహువిధ బహుమానంబు లొసంగి, ఫాల మందు మంత్రసంబద్ధమైన హేమపట్ట మమర వివిధ మంగళ వాద్య ఘోషములు చెలంగ,

సీ. శ్రీరామ పాదుకా । సేవాభినిరతుండు
భరతుండు ఛత్రంబుఁ । బట్టి నిలువ
సౌభ్రాత్రనిధులు ల । క్ష్మణుఁడు శత్రుఘ్నుండు
వినతులై చామరాల్ । వీచుచుండ
నిత్యానపాయిని । నిఖిల జగన్మాత
సీత వామాంక సం । స్థితిరహింప
శ్రీరామముద్రికా । చిత్తసంధావని
పావని పద పీఠ । మై వహింప
హరినిశాచర సామంత । వరులు బలసి
రామకృత విక్రమములు కీ । ర్తనము సేసి

కొలువ రాముఁడు సకల సద్గుణగణాభి
రాముఁడప్పుడు పట్టాభి రాముఁ డయ్యె.

క. తండ్రిక్రియ రామచంద్రుఁడు
తండ్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపన్
దండ్రుల నందఱు మఱచిరి
తండ్రిగదా రామచంద్ర ధరణిపుఁ డనుచున్.

శ్రీకోదండరామచంద్రార్పణము

శ్రీ శ్రీ శ్రీ

